శ్రీసద్గురవేనమః

# ప్రకటన పత్రిక.

చెన్నపురంబున, పెద్దినాయనిపేట నాటుపి
గుడివీధి కవాటసంఖ్య (౨౦)గల మందిరంబున,

| | వెలలు. | పోస్టేజి. |
|---|---|---|
| ౨౭౫-శ్లో. టీ. తా. సుజ్ఞానదీపమనుగురుగీత | ౧-౪-౦ | ౦-౧-౦ |
| శ్రీశివరామదీక్షితీయమను అచలగ్రంథం | ౧-౦-౦ | ౦-౧-౦ |
| రసికజనానందము. జీవేశ్వరసంవాదము | ౦-౧౨-౦ | ౦-౧-౦ |
| శుద్ధనిర్గుణతత్వ కందార్థ తాత్పర్య సహితం | ౦-౧౨-౦ | ౦-౧-౦ |
| శ్రీకృష్ణబోధామృతమను ౧౨-రాజులకథలు | ౦-౧౨-౦ | ౦-౧-౦ |
| అష్టావక్రగీత, తాత్పర్యసహితం... ... | ౦-౧౦-౦ | ౦-౧-౦ |
| మహా చక్రవర్తుల ఇంద్రజాలపుకథలు ... | ౦-౮-౦ | ౦-౧-౦ |
| శ్రీవసిష్ఠజనకసంవాదం-అతీతమార్గము... | ౦-౮-౦ | ౦-౧-౦ |
| శ్రీకృష్ణోద్ధవసంవాదం పరమపదమార్గము | ౦-౮-౦ | ౦-౦-౬ |
| శుకపంచవింశతియను చిలుకచెప్పిన కథలు | ౦-౮-౦ | ౦-౧-౦ |
| జనకసులభసంవాదమనుప్రశ్నోత్తరరత్నమాలం | ౦-౮-౦ | ౦-౧-౦ |
| జడభరతోపాఖ్యానం వచనకావ్యం ... | ౦-౮-౦ | ౦-౧-౦ |
| భక్తవిజయంబను మహాపతిచరితలకథలు ... | ౦-౬-౦ | ౦-౦-౬ |
| ఉషాపరిణయము వచనము... ... ... | ౦-౪-౦ | ౦-౦-౬ |
| నృగుమహారాజు చరిత్ర ... ... ... | ౦-౪-౦ | ౦-౦-౬ |
| యోగానంద చరిత్ర ... ... ... | ౦-౨-౦ | ౦-౦-౬ |
| అద్వైతరహస్యం ... ... ... | ౦-౨-౦ | ౦-౦-౬ |
| ఆత్మవిలక్షణసారం ... ... ... | ౦-౨-౦ | ౦-౦-౬ |
| ఆంధ్రపంచీకరణము ... ... ... | ౦-౨-౦ | ౦-౦-౬ |

ఈపుస్తకము గ్రంథములన్నియు నీక్రిందసంతకముచేసినవారియొద్ద విక్రయింపఁబడును.

ఇట్లు : గ్రంథకర్త.

పోకల - శేషాచలమునాయఁడు.

# విషయసూచిక.

ముందు అచ్చువేయబడిన ౧౨౦ - తత్వ కీర్తనల తోడ మరల ౫ - తత్వకీర్తనలు చేర్చఁబడి మొత్తం ౧౨౫ - తత్వకీర్తనలు అచ్చుకూర్పించి ప్రచురింపఁబడియె.





శిష్యుఁడు,

సిందె-వేంకట్రావు.





గురుఁడు,

పోకల - శేషాచలమునాయఁడు.



శ్రీసద్గురవేనమః.

# సుజ్ఞానరత్నావళియను

## వేదాంతకీర్తనలు.

శ్రీమద్వేదాంత ప్రవర్తకులును, సచ్చిదానంద స్వరూపులును, మహాయోగపురుషులును, అష్టాంగయోగసమాధి నిష్ఠాగరిష్టులును, జ్ఞాన విజ్ఞాన సంపన్నులును అయిన పెద్దలచేత రచియింపంబడిన తత్వకీర్తనలు.

### పోతులూరి వీరబ్రహ్మముగారి కీర్తనలు.

(౧)–రాగము నాదనామక్రియ - చాపు తాళము.

పల్లవి.

ఓంనమఃశివాయసిద్ధమైనాపదవి – ఓంకారమేదిరా ఓరీ॥

అనుపల్లవి.

ఒనరుగా త్రికూట భ్రూమధ్య మందున్న
వాడెవ్వడోచూడరోరి ॥

చరణములు.

అ ఆలుపదియారు అక్షరంబులకాది హరుడెవ్వడో చూడరోరి–అహంకారమనుచిలుక హంసతోగూడుకొని ఆడించుచున్నాడురోరి॥ఓం॥ కఖాలుపదిరెండుపర్వములుచేసుకొని కర్ణమేసుకచూడరోరి–కదిసిరేకులతుదను కాంతయొకటున్నది కొరకంతు డెఱుగురావ్వోరి॥ఓం॥ తథదధాయనె తత్వములమెట్టెక్కి తలుపు తీసుకచూడ

రోరి తేరతేరకాదుయీదేవాలయంబులో తేటగానున్నా
డురోరి॥ఓం॥యరలవనారాయణ పరబ్రహ్మమితడనుచు
నీశ్వరీయీశ్వరుడురోరి - శివసహాయనే శివపోతులూ
రయ్య సాక్షియైయున్నాడురోరి॥ ఓంనమశివాయ॥

(౨.)—రాగము ఇంగ్లీషువర్ణమెట్టు.

పల్లవి.

శివపంచాక్షరిమంత్రం—పర శివయోగుల కేజపసూత్రం।

అనుపల్లవి.

అవిరళయోగం బందినవారికి - ఆరింటిమీద
చిద్రూపం॥ శి॥

చరణములు.

ఐదుముఖంబుల పెనగింది - అయిదక్షరముల నమ
రింది అయిదు అయిదులు యిరువైయైదై అఖండ తే
జంబీమంత్రం॥ శివ॥ మూడుత్రోవలది సాకారం మూ
టి నడుమనుశ్రీకారం - చూచేదంతయు సాకారం చూ
పునిలిపితే నిరాకారం॥ శివ॥ సుషుమ్నాంతమున గురు
తేజం - అష్టకమలమున శివపూజం - వేయికమలమున
మహాపూజం - గురువీరేశునిఘనతేజం॥ శివపంచాక్ష॥

(౩.)—రాగము ఆనందభైరవి - ఏకతాళము.

పల్లవి.

ఎంతమంచిగురుడుదొరికెనే - ఓయమ్మలార॥ ఎంత॥

అనుపల్లవి.

ఎంతమంచి గురుడుదొరికె అంతరంగమందునన్ను
చింతలేక గురునిపాదము చెంతజేరియుండుమనెనే॥ ఎం॥

చరణములు.

కన్నులు వీనులుమూసి గాలిరాకపోకదెలిసి - పున్నమవెన్నెల బైట కన్నుదెఱచిచూడుమనె॥ ఎం॥ పంచకోశములుబాసి పంచముద్రలన్నిఁరోసి - పంచవింశతి తత్వమూవలబట్ట బైటజేరుమనె॥ ఎం॥ పరముమహాత్ముఁడు బ్రహ్మమేనారాయణుఁడు - ధరలో శివపోతులూరి దైవరాయుడొక్కఁడనె॥ ఎంతమంచి గురుడు దొరికెనే॥

(౪.)—రాగం కాంభోజి - అటతాళము.

పల్లవి.

చెప్పెదగురుమహిమ తెల్పసినంతటమీరు తెలుసుకోండి॥

అనుపల్లవి.

విప్పిచెప్పగనేనెంతటివాడను—శరణంటివుప్పుకోండి॥ చె॥

చరణములు.

చింతమానుమీద చేమంతిపూసెను తెలుసుకోండి—ఆచేమంతిమీదను చెంగల్వపూసెను తెలుసుకోండి॥ చె॥ భూరుహామునరెండు పుట్టలుగలవయ్యా తెలుసుకోండి—ఆపుట్టలలోరెండు పెనుబాములున్నవి పట్టుకోండి॥ చె॥ పట్టుకొనినమీద పైగా రెండుగుండ్లు తెలుసుకోండి - ఆ గుండ్లమీదనొక్క గూబకూర్చున్నది తెలుసుకోండి॥ చె॥ మూడుమూలలపెట్టె మూతదీసెనేర్పు నేర్చుకోండి—ఆ మూతదీసితె పెద్దభూతము గనుపడును తెలుసుకోండి॥ చె॥ భూతమునెత్తిన జ్యోతియొక్కటిగలదు తెలుసుకోండి - ఆజ్యోతి వీరబ్రహ్మం శివపోతులూరయ్యా తెలుసు

కొండి॥ చె॥ తెలిసినవారికి తేనెమ్మామిడిపండు
కొండి-తెలియనివారికివిషముష్టిపండని తెలు[illegible]డి॥

(౫.)—రాగము నాదనామక్రియ - ఆదితాళము.

పల్లవి.

ఊరేటితిత్తుల పైగానుండే - ఉన్మణి తెలియర - ఓరన్నా॥

అనుపల్లవి.

తిత్తులనమమనుచక్షులమీదను చీకటిగొట్టరఓరన్నా॥

చరణములు.

చీకటిగొట్టను తోకనాలుక తీసుకలేపర - ఓరన్నా-
తీసుకలేపితె కాకకుపాముచిత్తున లేచుర - ఓరన్నా॥ఊ॥
శంఖుచక్రముల-నట్టనడుమ ఆశేషునిలేపర-ఓరన్నా -
ఓంకారించుకయున్నది పాముకొంకకలేపర - ఓరన్నా॥
ఊ॥ ఆరుచక్రముల కావలయావల లోపలవెలుపల-ఓ
రన్నా-ఆరుచక్రముల బెనుచుక పాము - అధోముఖం
బై-ఓరన్నా॥ ఊరే॥ రెండుచక్రములు విడిబడియున్నవి
కుండలిలేపర *- ఓరన్నా - రెంటికిసూత్రము మలిచు
ట్టొక్కటిలేపె పోతులూరి వీరన్నా॥ ఊరే॥

(౬.)—రాగము ధన్యాసి - ఏకతాళము.

పల్లవి.

చిల్లర రాళ్లకు మ్రొక్కుచునుంటె -
చిత్తము చెడిపోను రేవ్రురే॥

అనుపల్లవి.

చిత్తమందున - చిన్మయజ్యోతిని -
జూచుచునుండుట సరేసరే॥ చి॥

చరణములు.

ఒక్కప్రొద్దులనియెందుచునుంటె - ఒనరుగచెడుదు వు-ఒరేఒరే - ఏకమైన యావైభవమూర్తిని జూచుచు నుండుట-సరేసరే॥ చి॥ నీళ్లలోమునిగి గోణుగుచునుం టెనిలకడచెడునుర-ఒరేఒరే-నిలకడనుండె నిర్మలజ్యో తిని జూచుచునుండుట - సరేసరే॥ చి॥ బాధగురువుల పంచనుజేరితె భావముచెడునుర - ఒరేఒరే - భావమం దునబ్రహ్మకాంతిని జూచుచునుండుట - సరేసరే॥ చి॥ భూములుఅడవులుతిరుగుచునుంటెబుద్ధులుచెడునుర-ఒ రేఒరే-బుద్ధిలోవుండేపున్నమచంద్రుని జూచుచునుండు ట-సరేసరే॥ చి॥ వీరయ్యచెప్పినవాక్కును నమ్మితె వివ రము తెలుసును-ఒరేఒరే - వివరమందుండే విగ్రహ మూర్తిని జూచుచునుండుట - సరేసరే॥ చిల్లర॥

(౭.)—రాగం మాయామాళవి - ఆదితాళము.

పల్లవి.

కాశికి పోవలెనాతీర్థము - మోసుకరావలెనా।

అనుపల్లవి.

కాశితీర్థముకన్నులనున్నది-దేశికన్నుశివకాశిగనున్నది॥

చరణములు.

అంగములోపలను కుండలిసంగముదాపునను - గం గాయమున పొంగుచుపారగ - రంగుగనడుమను లింగ ముండగను॥కా॥ కోనకుపైగాను తీర్థస్నానగురియగాను- మేనుమరచి నీవుకానకతిరిగెవు - లోనవెదకి శివధ్యాన ము చేయక॥ కా॥ భావములోపలను జీవునితావు తె

లియకను-జీవగుణంబులు చిక్కవిడిచితా-జీవబ్రహ్మము తావుదెలిసితే॥ కా॥ వాళిగతనలోను - కాశినివాసు డుండగాను - జేసిన పాపము బాసిపోవునని - కాశికిపో దును నివాసునిగానక॥ కా॥ పొందుగధరలోను వీరగో విందు డుండగాను - అందమైనగురు ఈశ్వరిపాదము - అందితె కైలాసమందేయున్నది॥ కాశికి॥

(౮.)—కాంభోజి రాగము - అటతాళము.

పల్లవి.

నడిమికంటిలోననారాయణుడున్నాడు - నాతులారా॥

అనుపల్లవి.

మడుగులో దీపముమరివెలుగుచున్నది - మగువలారా॥

చరణములు.

ఎడమ కుడుల నడుమ వెలుగుచునున్నాడు వెలదు లారా - ముడిబొమలసంధున మురియుచునున్నాడుము దితలారా॥ న॥ ఒడయనిముఖమందు పొడమినవాడ మ్మ వనితలారా - పుడమిలోపల యీపుణ్యునిగానరె పూబోణులారా॥ న॥ నీళ్లకుండల నడుమ నిక్షేపము న్నది - ననబోణులారా - నీళ్లలోమునిగి తనబ్రేల్లుతెం చిసలేదు వెలదులారా॥ న॥ వేళ్లుపారిలోకమంతనిండినా డు అలివేణులారా - గోళ్లుపెంచుకయెంతో గోణగినను లేదు కొమ్మలారా॥ న॥ జంటనాగస్వరములంటుక యు న్నాడు జాణలారా-వాడంటితామరసీరంటనట్టున్నాడు అతివలారా॥న॥ మింటినసుమమిధున శేష మైయున్నాను

బోటులారా - కంటిలోనము క్తికళలంటి పెనగునె కాంతలారా॥ నడి॥ తన్నుతాదెలిసిన ధన్యులకీపండుతరుణులారా - కన్నచోటనె ఉన్నదికనియనుభవించరెకాంతలారా॥ నడి॥ కందిమల్లయపల్లె మందిరముననుందికాంతలారా - ఇందుధరగోవిందబ్రహ్మమె లలనలారా॥ నడి॥ అందముగాగురు-ఈశ్వరమ్మపాదమతివలారా - చెందినవారికిచేదోరుకుయి●పండు చెలియలారా॥ నడిమికం॥

(౯.)—రాగము ధన్యాశి - ఆదితాళము.

పల్లవి.

యజ్ఞముచేసెసుజ్ఞానుల్కకువేదోక్తపువిధి తెలియరయా।

అనుపల్లవి.

ఆగమసారము లనేకశబ్దము లన్నియుమునుతా
నెరుగవలెరా॥ యజ్ఞము॥

చరణములు.

అగ్రజన్మమైనందుకు తనలో అగ్నిలేపి కూర్చుండవలెరా - ముగ్గురికిహితవుగ మూలజన్మములు ఫాలమందుశోధింపవలెరా॥ య॥ ఊది ఊదిపొయ్యాదేటప్పుడు పూపిరిసమరసమెరుగవలెరా - సారంబగుసంసారసాధకులై చవిలోచవిగని తిరుగవలెరా॥ య॥ కామక్రోధమనుపశువునుబట్టి కర్మద్వారమున కట్టవలెరా-కాకోజ్వాలలవాలలాడుచును యాలలుపాడుచునుండవలెరా॥య॥ మనోబుద్ధిచిత్తాహంకారంబున మరిగినకండలుతరుగవలెరా-సుజ్ఞానుల్కకగా సుడిబడికన్నుల చూపునమంటలు వ్రేల్చవలెరా॥ య॥ మగ్నత్వంబున అగ్నిలోవ్రేల్చెను

నసుక్రొొవ్వపారదీయవలెఁ - సుజ్ఞానంబను సుబ్రాహ్మ ణులందరుసుషుమ్నమందుసురతాగవలెఁ॥ య॥ సత్తు చిత్తు ఆనందంబనియేచవిలో చవిగనితిరుగవలెఁ - జాతినీతులుజన్మమరణాదుల బూతిభూషితో కొట్టవలెఁ॥ య॥ అండపిండ బ్రహ్మాండంబులు మూడుకుండలియని తానెరుగవలెఁ-అంబరవీధిన రంభయూర్వశి దారివీవ గురుజేరవలెఁ॥ యజ్ఞము॥

(౧౦.)-రాగము ముఖారి - చాపుతాళము.

ప ల్ల వి.

చిక్కదయ్యబ్రహ్మము-దక్కదయ్యా॥

అ ను ప ల్ల వి.

చక్కగానుముక్కుతుదను నిక్కిచూపునిలుపకున్న॥ చి॥

చ ర ణ ము లు.

చిక్కదయ్యబ్రహ్మవేద్యము-చక్కనిగురుపాదపద్మము-నిక్కముగనెరనమ్మువారికి - చిక్కునేమోగానిమాయకు॥ చి॥ శాంతచిత్తముపొందకను - స్వాతంత్ర్యులై కలిమాయవాదుల -వింతవింతల డంబగాంద్రకునెంత మాత్రంబైనగాని॥ చి॥ కులమువాసన - కలిమివాసన-కొలిమిలోదిగనూదియూది - నిష్కలిత్తులై తెలివొందు వారికి - తొలగునేమోగానిమాయకు॥ చి॥ తనువు-మనసు-ధనము-గురునకుధారబోసి-యిలనురోసి - అనిశముశాంతసమాధిబ్రహ్మానందముక్తులకేమోగాని బ్రహ్మము॥ చి॥ తెలివిలోపల తెలివిదెలిసియు - తెలిసేగురు

దేవుడనిభావించిమదిలో - తలపవీరాచారికిని-కీర్తైలిపిన బ్రహ్మాదిబ్రహ్మం॥ చిక్కదయ్యా॥

(౧౧.)—హిందుస్తాని రాగము - చాపుతాళము.

పల్లవి.

కనుమదగ్గిర పోయి - కదలకే మనసా।

అనుపల్లవి.

కనుమ దాటిపోతె కలుగునె సేవా॥ కనుమ॥

చరణములు.

చెడుగుణంబుల జిక్కిచెడిపోకెమనసా-చేరిసద్గురుని సేవించవే మనసా॥ క॥ ఆలుబిడ్డలనమ్మి అల్లాడకెమనసా-ఆనందయింటిలో ఆట్లాడవే మనసా॥ క॥ సంతకూటమిదిసతిమెంచకె మనసా - సాగిపొయ్యేదారిసాధించవెమనసా॥ క॥ నీవునేను అనినిక్కకెమనసా - నీలతోయదమధ్య నిలువవెమనసా॥ కనుమ॥ మూన్నాళ్లబ్రతుకిది మురియకె మనసాముక్తికాంతనంటి ముద్దాడవెమనసా॥ క॥ మంటికుండయిదిమతిచెడకెమనసా-మహాసియజ్యోతినిమరువకెమనసా॥ క॥ ఎప్పుడోయేవేళోయెఱుగవెమనసా - ఎఱుకలోని యెఱుకయెఱుగవెమనసా॥ క॥ వీరయ్యదాసుని వాక్కువినవె ఓమనసా-వివర మెఱిగినీవు వింతగనుమనసా॥ కనుమ॥

(౧౨.)—రాగము శోకవరాళి - చాపుతాళం.

పల్లవి.

ఒక్కడేదేవుడన్నవారికి - వాదమేటికి - భేదమేటికిరా।

అనుపల్లవి.

నిక్కముగ యీలోకజనులు-ఒక్కడే దేవుడన్న వారికి॥

చరణములు.

పట్టువిడుపులు రెండు బట్టబయలు చేసి - నట్టనడుమ నుండె నాదము వినుకొంటు - రెట్టబట్టితిరి రేణుకారమ్మ ని-ముట్టుముగ్గురిని మొఱబెట్టివినుకొంటు-అట్టెబ్రహ్మాండమందు - ఆత్మగన్న వారికి - కష్టమేటికి నష్టమేటికిరా-యిష్టము ప్రాణము - లింగము - దృష్టిలోనేజూచు వారికి దిక్కుయేటికి దిగులుయేటికిరా॥ ఒ॥ ఆగమందుయోగమందుయోగనిస్సారమందు - స్త్రీలభేదమునందు - వాణిపాదమునందు-వాణిపాదమునందు-రాజపాదమునందు పారమునిస్సారమై చవిగొన్న వారికి - పుణ్యమేటికిపాపమేటికిరా॥ ఒ॥ అన్నిదెలసిజున్ను - ఆరగించుకొంటు-సున్నజేసితికొంత సూర్యచంద్రాదుల - కర్ణమేసితినిన్ను కన్నులజూచితి - పున్నమవెన్నెల - బైటనున్న నిర్వాణినేరము - యెంచనేటికి- పంచనేటికిరా॥ ఒ॥ పగలురాత్రియొక్కరీతిగనినుజూచి - వగలసూర్యచంద్రవానిని కనిపెట్టి - నిగమగోచరమైన నీలవర్ణపుజ్యోతి - తను వుయుడిగిన మోక్షతత్వయుపచారికి-టక్కులేటికి-ఠిక్కులేటికిరా - చక్కనిమనవీరగురుని - దిక్కుయని నమ్మిన వారికి - జన్మయేటికి - మరణమేటికిరా - జన్మాదులాకు వెళ్లనేటికి - మఱలనేటికిరా - ప్రపంచమందు చిక్కనేటికి - చొక్కనేటికిరా॥ ఒక్కడే॥

(౧౩.)—రాగము ముఖారి - చాపుతాళము.

పల్లవి.

ప్రపంచనడతలుజూటా - మన - పెద్దలవాక్యమెబాటా।

అనుపల్లవి.

ముగ్గురుమూర్తులుజూట - మూలముయెఱుగుటబాటా॥

చరణములు.

చదువు శాస్త్రములుజూట - ఒరె - సద్గతియెఱుగుటబాట॥ ప్ర॥ అన్నిటి గొల్చుటజూట - తన ఆత్మలో యెఱుగుట బాట॥ ప్ర॥ మణిమంత్రంబులుజూట - మదిలోయెఱుగుట బాట॥ ప్ర॥ యోగులుజేసుటజూట - రాజయోగము యెఱుగుటబాట॥ ప్ర॥ కొండలు తిరుగుటజూట - ఈ - కోటలోయెఱుగుటబాట॥ ప్ర॥ కాశికి పొయ్యేదిజూట-మనకంటిలో-యెఱుగుటబాట॥ ప్ర॥గురువులేనిమాటజూట - గురుకీలక మెఱుగుటబాట॥ప్ర॥ పసులనుయెఱుగుటజూట - గురుపాదముయెఱుగుట బాట॥ ప్ర॥ వీరయ్య దాసునిమాట - దానివివరముయెఱుగుటబాట॥ ప్ర॥ నమ్మనివారికిజూట - గురుని - నమ్మినవారికి బాట॥ ప్రపంచనడతలుజూట॥

(౧౪.)—రాగము ఆనందభైరవి - ఆది తాళము.

పల్లవి.

ఏవూరయ్యా మీదేవూరు । 

అనుపల్లవి.

పరబ్రహ్మనిర్వాణమె మావూరు॥ ఏవూరయ్యా॥

చ ర ణ ము లు.

కందిమల్లయపల్లె మావూరు - కాలకర్మాలుబాపునుమావూరు॥ ఏ॥ కనమ - ఆకటనుండుమావూరుఇట్ల-కనవచ్చుకనరానుమావూరు॥ ఏ॥ ఇంటిలోపలపుట్టమావూరు - పాము - నంటితెఫలమిచ్చుమావూరు॥ ఏ॥ కర్మజీవులకెల్లమావూరు - అంధకారమైయుండునుమావూరు॥ ఏ॥ కర్మము తెగితేనుమావూరు - పండువెన్నెలైయుండును మావూరు॥ ఏ॥ రోగాలులేవయ్య మావూరు - నిత్యభోగాలుగలిగుండు మావూరు॥ ఏ॥ జంటితేనెయపల్లెమావూరు- బహువింతలుగలిగుండుమావూరు॥ ఏ॥కనికానకున్నదిమావూరు - ముక్తికారణమైయుండుమావూరు॥ ఏ॥ పాపలనడుమనుమావూరు - బట్టబయలైయుండును మావూరు॥ ఏ॥ శృంగారమైయుండుమావూరు-శ్రీరంగమ్మవసియించుమావూరు॥ ఏ॥ తల్లిగోవిందమ్మమావూరు - తండ్రివీరబ్రహ్మంమావూరు॥ ఏవూర॥

(౧౫.)—రాగము బేగడ - చాపుతాళము.

ప ల్ల వి.

చెప్పలేదంటనక పొయ్యేరు నరులారగుసుని।

అ ను ప ల్ల వి.

చేరిమ్రొక్కితె బ్రతుకనేర్చేరు॥ చెప్ప॥

చ ర ణ ము లు.

చెప్పలేదంటనకపోయేరు తప్పదిదుగోగురునివాక్యముతప్పుదోవలపోవువారల చప్పరించిమ్రింగుశక్తులు॥ చె॥ మొప్పెతనమున మోసపోయేరు-ఇదిగాక కొందరు

గొప్పతనమున గోసుమీరేరు - ఇప్పుడప్పుడనరాదుమె
ప్పుడోయేవేళనోమరి-గుప్పుగుప్పునిదాటిపోయెదు గుట్టు
పడుగులు యేరుపడును॥ చెప్ప॥ తాకుతప్పులుతలచకు
న్నారు - తార్కాణమైతే యెక్కువతో దెలియనేర్చా
రు - జోకతోడుతతల్లిపిల్లలుజోడుబాసి - అడవులం
దు - కాకిశోకముజేసిప్రజలు కాయగసరులునమలిచత్తు
రు॥ చెప్ప ॥ కేకవేసిప్రాణమిడిచేరు రాకాసిమూకలు
కాకబట్టి కలువరించేరు - ఆకాశముయెత్తునౌను - ఆరు
మతములుయెక్కటౌను - లోకమందునజనులు - అంద
రునీరు-అగ్నిలోమునిగిపోదురు॥ చె॥ అగలువిడచి పొగ
లు దాటేరు - ఇదిగాక పట్టపగలుచుక్కలుచూచిభ్ర
మసేరు - భుగులుభుగులుధ్వనులుమింటను పుట్టియేగిన
పిమ్మటను-దిగులుపడుచుప్రజలుచాలా దిక్కులేని పక్షు
లౌదురు॥ చెప్ప॥ పాతకులు పడటగలిసేరు - పుణ్యాత్ము
లైన - సాధకులు సంతసించేరు - భూమిమీదధూము
ధాములు పుట్టిరేగిన పిమ్మటను - రామరామయనని
వారలు రాలిపోదురు తెలుసుకొండి॥ చెప్ప॥ యేమొ
యేమో యెరుగకున్నారు - యెండెండుజూచిన యము
నిపురికేనడువ మాదూరు - భూతలమునయిట్టి వింతలు
పుట్టియణగినపిమ్మటాను - నీతికృతయుగధర్మ మప్పుడు
నిజము నిలకడమీద తెలుసును॥ చెప్ప॥ ముందు వెను
కనుగానకున్నారు - మూర్ఖులైభువిలో ముందుగతియు
యెఱుగకున్నారు - కందువతోచిన్న పెద్దల కన్నుగానక
గర్వములచే - ముందెమేళము లాడెవారిని బందు బం

దుగగోతురక్కడ॥ చెప్ప॥ కీడుగైనను కూడదందురు - ఒనకూడినప్పుడు - యేడజూచినవాడుకొందురు - వేదు కతోపోతులూరివీరభోగవసంతరాయులు యేడుదీవులు యేకచక్రము యేలును బ్రహ్మాండమంతయు॥ చెప్పలే॥

(౧౬.)—రాగము కల్యాణి - అట తాళము.

పల్లవి.

నేజూచినానే బ్రహ్మమునాలో నేజూచినానే॥

అనుపల్లవి.

నేజూచినానమ్మ నెలతరోతారక - రాజయో
గులుచూచే రమ్యమైనమూపు॥ నేజూచి॥

చరణములు.

కన్నులనడుమను సన్నబిలంబులో - ఉన్నతమైనట్టి పున్నమచంద్రుని। నేజూచి॥ చూపులలోపల పాపలన డుమను - వ్యాపించివెలిగేటి - ఆపరం జ్యోతిని॥ నే॥ ఫాలభాగము నందు నీలజ్యోతుల సంధు - వాలలాడు చునున్న వరలింగమూర్తిని॥ నే॥ చతురాగ్రమందు-అ క్షయవీధిలో - నిక్షేపముగ వెలిగె సాక్షిభూతమునాలో॥ నే। చందమామనడుమ కుందనాకృతియేమొ - ఆనంద ముగవెలిగె - హరిపోతులూరివీరగురుని॥ నేజూచి॥

(౧౭.)—రాగము చక్రవాకము - ఏకతాళము.

పల్లవి.

ఈజన్మమికదుర్లభమురా - ఓరి

అనుపల్లవి.

సాజన్మసాకార సద్గురునిగనరా॥ ఈ॥

చ ర ణ ము లు.

పంచాక్షరీమంత్రంబుపఠనచేయరన్న - పఠనజేసితే యముడుపారిపోనన్న - పారిపోతే - అంబఫలమిచ్చునన్న ఫలమునందినవాడు పరమగురుడన్న॥ ఈ॥ మూడారు వాకిళ్లు మూయవలెనన్న - ముక్తివాకిటనిలిచి తలుపుతీయుమన్న - తలుపుతీసితెఅంబతేజమిచ్చున్న - తేజమందినవాడుతాగురుడాయన్న ॥ఈ॥ ఆరునములమీాద-అంబవుందన్న - అంబలోదుర్గాంబ-ఆట్లాడునన్న - ఆట్లాటలోమంచి అర్థముందన్న-అర్థమెఱిగినవాడు హరిగురుడన్న॥ ఈ॥ నాసికములో దృష్టినడిపించుమన్న - నడిపించిమరినీవు నమ్మియుండుమన్న - నమ్మినవరత్నముల పీఠమెక్కన్న - పీఠమెక్కితె - అంబపిలుచునోయన్న -పిలచినంతటనీవునిలుచుండుమన్న - నిలిచినంతటివాడునిజగురుడన్న॥ ఈ॥ జంటకోవులురెండు-అంటివూదన్న అంటివూదిమేనుమరచియట్టెనిలువన్న - మేనుమరచిఘంటనాదమినుమన్న నాదమినిపోతులూరినినమ్మియుండన్న॥ఈ॥

(౧౭.)—రాగము నాదనామక్రియ - చాపుతాళము.

ప ల్ల వి.

చూడు - బ్రహ్మము - నీలోచూడు।

అ ను ప ల్ల వి.

చూడుబ్రహ్మముసూటిగానువెలిగె -
ఆనందంబున - ఆసద్గురుని॥ చూడు ॥

చ ర ణ ము లు.

ఇడాపింగళులనేనాడి - ఆరెంటినడుమ - వీణెదాం

తుల బోలుగాలి - మే_లైనపుష్పముఁబోలువాసనగాలి నాడి - షడుచక్రంబుల సాధకంబులును - వేయురేకుల వెలిగెటిపద్మము - నాదబిందుకళలుండెటితావు - నాదస్వరమునబల్కే విధముగ - నాళ్లమధ్యమున నాదబ్రహ్మము-కనివినివికసద్గురుని వెదుకుము॥ చూ॥ ఆధారము ననంటిచూడు అందులోనాద-ఉకారముననణగిచూడు-చూచినవెనుక - మకారమునుబొందెదవు - ఆనందం బొందియుసోహసంబున - నిస్సోహసంబున - ఆవలఁయీవలఁదోఁవలఁబోకుము - ఏకమార్గమున యెక్కిచూడుమిక - చక్కనియాత్మను శక్తిలోడుతను॥ చూ॥ కంటి - ఆధారముననుంటి - ఘూత్రోవలోన వింతయొకటినేను గంటి-కంటిసద్గురు కమలముపై-ముక్కంటివిధంబులు మూడక్షరములు - ఐదువిధంబులబల్కే ప్రణవము - అక్కడఅఖండజ్యోతిని - ఆపీఠము - ఆహెచ్చరికను - ఆత్మలోపలను-కన్నులచల్లగకంటినిబ్రహ్మము॥ చూడు॥

(౧౯.)—రాగము ఆనందభైరవి - చాపుతాళము.

పల్లవి.

అందమైనపూలుగో[illegible]మ ఆత్మారామునిపూజచేతామ॥

అనుపల్లవి.

కందర్పజనకుని యిందిరశ్రీదేవి - బిందుపీఠము సందుపొందికైయున్నది॥ అందమైనపువులు॥

చరణములు.

భావాభావమునందు జూతామ - భక్తజనులసంతోషముచేతామ - భావమందుగురుని దలుతామ - భక్తితో - వారిపూజచేతామ॥ అం॥ శ్రీగురుడితడనిగోలుతా

మ - మనచిత్తమందు పూజజేతాము - ఓమహీనందన నీమహిమజెలిసెను - సామజవరదుని సతికి పూజలుమ నము॥ అం॥ కమ్మని మధురము గ్రోలుచు - మనము నె మ్మతిగాపూలుగోయుచు - నెమ్మతిభావము లిమ్మనిమది లోన - సమ్మతిగావూజనేర్పుతోనుమనము॥ అం॥ అంగ ములోపల జూతామా - భుజంగభూషణుని సేవచేతా మా - అంగము లోపలలింగముగనుగొని - అంగసం యోగము శృంగారముగామనము॥ అంద॥ మూడారు వాకిళ్లుమూతామా-మోక్షద్వారపుతలుపు దీతామా- వేడుకతో పోతులూరునివాసుని - ఇడాపింగళనడుమ వీరగోవిందుని॥ అం॥ పట్టితిమమ్మఖిాపాదము-బట్టబయ లైనబ్రహ్మపూజచేతాము - ఘట్టిగ శ్రీపోతులూరియీ శ్వరిదేవినన్ను - చేపట్టిరక్షించు పరమపదరాణీ॥ అం॥

(౨౦.)—రాగము భ్యాగ్ - రూపకతాళము.

పల్లవి.

ఎంతలెక్కతిరిగిన నేమిలేదురా ॥

అనుపల్లవి.

చింతజేసిచూడకున్న వింతలేదురా॥ ఎంత॥

చరణములు.

ముక్కుదిక్కుమెక్కుబెట్టినిక్కిచూడరా - ఆ - ది క్కుమూలమేమొగాని దివ్యమాయరా॥ ఎం॥ ముసుకు గోనెముసుకువేసిపొసగిచూడరా - ఆముసుకులోనెము సుకుదీసిముక్తిచూడరా॥ ఎం॥ ఆకసమునగాలివిసరె నది గోచూడరా - ఆ - గాలిమూలమేమొగానిమూలచూ డరా॥ ఎం॥ మూలమూలలుశోధించిముక్తిచూడరా -

ఆ-మూలవున్నజ్యోతిని ముట్టించిచూడరా॥ ఎం॥ చల్ల
గాలివిసరితె మొల్లలాయెరా - ఆమొల్లలకాశించినవాస
నకొల్లలాయెరా॥ఎం॥ఎఱుపు నలుపు తెలుపులవియేమో
చూడరా - పచ్చపసుపంటినపద్మమాయెరా॥ ఎం॥ సత్తు
చిత్తుయొక్కపైతె శివునిపేరురా-ఆ - సత్తుపోతులూరిబ్ర
హ్మస్వామిపేరురా॥ ఎంత॥

(౨౧.)—రాగము ఎదుకులకాంభోజి-ఆదితాళము.

ప ల్ల వి.

ఆహాబ్రంహ్మాండమైనది ఆదిమంత్రము॥

అ ను ప ల్ల వి.

మనబ్రహ్మంగారుచెప్పినది పెద్దమంత్రము॥ ఆహా॥

చ ర ణ ము లు.

తెక్కముక్కలేనిపక్షి రేయింపగలుతపస్సుచేసి -
ఒక్కచెఱువు చేపలన్నియొకటేమ్రింగేను॥ ఆ॥ ఇంటివె
నుకతుట్టెపురుగు యింటిలోనందరినిమ్రింగె - జూడవ
చ్చిన జనులనెల్లచూచెమ్రింగెను॥ ఆ॥ కాళ్లుచేతులులేని
వాడుకడపముంతచేతబట్టి - నిండుబావినీళ్లన్నియొకడే
ముంచేను॥ ఆ॥ ఏటిమీదస్వాతికొంగ వేటలాడుచును
రాగ -చాటునున్నమీనుపిల్ల - అట్టెమ్రింగేను॥ ఆహా॥
చెప్పినవాడువీరదాసుచోద్యముగాను - ఆత్మతత్వము -
గొప్పవారుదీనిభావమువిప్పిచెప్పితేనుచాలు॥ ఆహాబ్ర॥

(౨౨.)—రాగము నాదనామక్రియ - ఆదితాళము.

ప ల్ల వి.

చెడుగుడాడెనే బ్రహ్మంబలిగుడాడెనే॥

అ ను ప ల్ల వి.

చెడుగుడుగుడుయని గుమ్మన్నాదముకలసి
బిందుకళలను గూడుక॥ చెడు॥

చ ర ణ ము లు.

ముప్పదిరెండక్షరములలో మేలైననొకయక్షరంబుతో నైకె గుబినైకెగుబినైకెగుబికూయుచు - నాలుగుముఖములనలుగురితరిమి-పదిదిక్కులకుపరుగెత్తించి-చెట్టుకొట్టగా పాలుకారగా॥ చె॥ ఖండతేజమైనిండుపౌర్ణమిపండువెన్నెలై ప్రభలికాయగా - ఆకటముగ్గురుయీఆకటనలుగురు నడుమనొక పెనువృద్ధి కడుసొంపుతోనిలిచి - సోహంసోహం సోహంభనిచెంగటబలుకుచు॥ చె॥ ఆర్గుగుచెల్లిరి ఆటగెలిచెను - అభ్యాజ్ఞాచెను ఆనందించెను - వింతదెలిసినవీరపోతులూరు॥ చెడుగుడాడెనె బ్రహ్మం॥

(౨౩.)—రాగము ఆనందభైరవి - ఆదితాళము.

ప ల్ల వి.

ఎక్కడివింతే ఫ్రోళమ్మా యెక్కడివింతే॥

అ ను ప ల్ల వి.

ఎక్కడివింతేవీరగురుడు వెదికిపట్టినన్నుదెచ్చి - మతములమంత్రార్థమెల్ల హితవుజేసిధారబోసె॥ ఎక్క॥

చ ర ణ ము లు.

పుట్టగిట్టకుండమేన భూతిబూసియీతీరున - పట్టులేనిసంసార భ్రాంతులన్ని విడువమనె॥ ఎ॥ కామక్రోధలోభమోహ గర్వములను కడకుజిమ్మి - కారణమైనబీజములో కన్నుదెరచి జూడుమనె॥ ఎ॥ ఎక్కడివింతేవీరగురుడు వెదికిపట్టి నన్నుదెచ్చి - ముక్కుదిక్కుమొక్కబెట్టి నిక్కి జూడుమనెనమ్మా॥ ఎ॥ కుండలనగనాదమనగాఅఖండ

మైన జ్యోతిజూపి - రెండుయిండ్ల నడుమఅజపకుండలిరే
చించుమనె॥ ఎ॥ చర్మధర్మ మిధునమనగా శేషికినే శేషి
ననగ - వాసియైనవీరగురుడు దాసిగానుయేలెనమ్మా॥ఎ॥

(౨౪)-రాగం బ్యాగ్ - ఆదితాళము.

పల్లవి.

పోతుంద్రన్నా - చెప్పకలేచిపోతుందన్నా॥

అనుపల్లవి.

పోతుందియీజీవి - బొందివిడిచిపెట్టి - ఖ్యాతి
గాను - ఆపో - జ్యోతిమలిపిజీవి॥ పో॥

చరణములు.

కోదండగురుజగ - దండ్లబిరుదుపూని ఖండముడిగి
బ్రహ్మాండమునిండగ॥ పోతు॥ కోపతాపములను - యే
పుమాన్పికను పాపలనడుమను - చూపునిలిపిజీవి॥ పో॥
ఆరుచక్రముల - మీరిసరోరుహా - జేరియోగసమాధి-
జెందిజీవి॥ పోతు॥ అరమరలేకతా - మర్పణమునుజేసి-
శరణని శ్రీవీర - గురునికలియజీవి॥ పోతు॥

(౨౫.)-రాగము ముఖారి - చాపుతాళము.

పల్లవి.

*రమ్మనే - గురుని రమ్మనే ॥

అనుపల్లవి.

సద్గురునియింటకురమ్మనే - గురునిరమ్మనే ॥

చరణములు.

ఇమ్మనేమనవింగురుని - ఇమ్మనే యుపదేశములు -
కమ్మకొనికనుబొమలనడుమను - బొమ్మలాటాడించెగు
రుని॥ ర॥ నామబింబకళల చేత నాడుచుండ గానునేను

కూడికుండలి-నట్టనడుమ సూక్ష్మసుందరమైనగురుని॥ ర॥
ఆరుమతములనాగ్రహించి - ఆరుమూటినిత్రుంచివేసి
ఆరుచక్రములకుపైన - ఆత్మరూపుడైనగురుని॥ ర॥ పే
డుకతో శివపోతులూరి - వీరభోగవసంతరాయలుయేడు
దీవులుయేకరాజ్యముయేలుచుండే వీరగురుని॥ రమ్మనే।

(౨౬.)—రాగము హిందూస్తాని - ఆదితాళము.

పల్లవి.

ఒట్టియాచారముల - కష్టమేమిటికి।

అనుపల్లవి.

చట్టలోపలిముట్టుసమిసెదెన్నటికి॥

చరణములు.

ముట్టైతినని సతులు మూనాళ్లకడనుండి - ముట్టరా దనినీళ్లమునిగిమునిగి- గుట్టుదెలిసి తెముట్టుబట్ట బయట నెయుండు - గట్టిగానీమనసుకట్టివేసి తేను॥ఒట్టి॥ ముట్టు లోనెబ్రహ్మ విష్ణుజన్మించెను - ముట్టులోనేశివుడుమూ ఢమాయె - ముట్టులోనేజగముమునిగితేలుచునుండు- వట్టినీళ్లలోమునుగ ముట్టేడబోయె॥ ఒట్టి॥ నవమాస ములముట్టు కవగూడిదేహంబు - శివమాడబోయ్యేటి జీవులకును - బహువినాశముచేయు బహుళకుంభకమం దు - పనిబూనిపోతులూరు బ్రహ్మమేసత్యం॥ ఒట్టి॥

(౨౭.)—రాగము హిందూస్తాన్ కాఫీ - ఆది తాళము.

పల్లవి.

నిదురబోకచూడరా - నీలోనేదేవుడురా।

అనుపల్లవి.

పదిలముగనునిదురబోయి - పరమపదమేజేరరా॥నిద్ర॥

చ ర ణ ము లు.

గాలిరాకపోకరా - ఘనతనాసికముగా - వాసివన్నె యేమిలేదు - నాసికము త్తదిరా॥ ని॥ పాములుపదియుం డురా- పడిగలె త్తియాడురా-పడిగలక్రిందబాలుడొక్క- డు-పారిజాతముచదువునురా॥ ని॥ కుండలినిభేదించరా- గురునినీలోదెలియర-కుండలికిపైగనుండె-దండితేజము గాంచరా॥ ని॥ ఏడుకొండలెక్కరా-యెగువతిరుపతిరా- యెగువతిరుపతిమీద - వెంకటాచలపతిరా॥ ని॥ వీనులు యిల్లాంద్రురా - యిరుగుపొరుగువారురా - యిరుగు - పొరుగునమ్మరాదు - వీనులువృత్తావిరా॥ ని॥ కుక్కనుదె గటార్చర - చక్కనయ్యనుమాడరా - టక్కుపిక్కులే నియాత్మ - డొక్కడేయున్నాడురా॥ ని॥ ఇన్నిగూడంగా నురా - యీలింగదేహమురా - మన్నునీరు అగ్నివా యువు - మనసుపోతులూరురా ॥నిద్రబోకచూడరా॥

## సి ద్ద ప్ప గా రి కీ ర్త న లు.

(౨౫.)—రాగము మోహనం - ఆదితాళము.

ప ల్ల వి.

జలజాక్షిరమ్మనెనే॥

అ ను ప ల్ల వి.

సద్గురుడు - ప్రసాదముకొమ్మనెనే॥

చ ర ణ ము లు.

కలికిరోయేమనుచుజెప్పుదు - కంటిలోవరి ముంటి తుదవలె - వెలుగుసూక్ష్మపు జ్యోతిలోపల - విశ్వరూ పములెల్లజూపుచు ॥జలజాక్షి॥ అరువన్నెలుదెల్పెనే - సే

త్రములసదా నందగతినిల్పెనే - చారుతరముగ సాంఖ్య యోగము సరణినా కెఱిగించి ముప్పది - యారుతత్వం బులను గూడిన - యాత్మగనుమని బోధజేయుచు॥జల॥ భవములు దెగటార్చెనే తారకయోగ - భావమునను గూర్చెనే - పవన ధారణలక్ష్యముద్రా భ్యాసములు విడి పించినిత్యము - భువనములుచూచేటి యెఱుకనుబొందు మని యుపదేశమొసగుచు॥ జ॥ భూతజాలముద్రుంచెనే- దుర్గుణములమూలము పెకళించెనే - నాతిరోయాకర్ణిం పవే - అమనస్క యోగము నిద్రకై వడి - యేతలంపు లులేని జీవేశ్వరైక్యం బనుచుదయతో॥ జ॥ భయము వదలమనెనే - రేబగలువినయముపొందమనెనే - బయ లునిర్భయులైనశంభుని - పట్టిజాగ్రస్వప్నసుషుప్తుల- క్రియలజెందక తుర్యపదమున కేళిసలుపుచు వెలుగు మనుచును॥ జ॥ అంగముకాదనెనే భామరో బ్రహ్మలింగ మునీవనెనే - సంగతంబుగ సిద్ధయోగీశ్వరునివాక్యము నమ్ముమనుచును - నిస్సంగివై సుఖమొందుమని సంసా రిపాశము వీడఁజేయుచు॥ జలజాక్షి॥

(౨౯.)—రాగము ఆనందభైరవి - ఆదితాళము.

పల్లవి.

చందమామ - చందమామ - చందమామ॥

అనుపల్లవి.

ఈసంధి తెలిపేజ్ఞానులెవరే - చందమామా॥

చరణములు.

కాయమనేపుట్టిలోనుచందమామ-పాము-మాయగా

నెమెలగుచుండు చందమామ|| చం|| పవనకుంభకంబుతో
ను చందమామ-పాము ప్రహారితిరిగియుండునయ్య చంద
మామ|| చం|| జంటనాగస్వరములూది చందమామ
పామును - అంటివూదిలేపవలెను చందమామ|| చం||
తోకద్రొక్కి తేనేపాము చందమామ - బల్కోపముతో
లేచునయ్యా చందమామ|| చం|| రాకపోకయేకమై తేచం
దమామ-పాము-లోకాలోకిమేలునయ్య చందమామ ||
చం|| తొమ్మిదివాకిళ్లుమూసి చందమామా - పామును-
నెమ్మదిగాపట్టవలెను చందమామ|| చం|| భక్తియనేక
ట్టుగట్టి చందమామా - పామును - యుక్తిచేసిపట్టవ
లెను చందమామ|| చం|| దేహిదేహములసందు చంద
మామ - పాము - తెలియకుండా చుట్టుకున్నది|| చం||
అజపమంత్రధ్యానముచేత చందమామ - పాము - అ
ఖండకళలతో వెలుగుచుండు|| చం|| పామునుబట్టే జోగి
యెవరె చందమామ - ఓహో అతనిపేరేసిద్ధగురుడు
చందమామ|| చం||

(౩౦)—రాగం నాదనామక్రియ - ఆటతాళము.

పల్లవి.

తియ్యనిమామిడిపండు - పండు||

అనుపల్లవి.

తినబోతెదొరుకదుతీపులుమెండు|| తియ్యని||

చరణములు.

పండుకువృక్షము - ప్రజలెవ్వరెఱుగరు - పరమా
త్ముడనేయాకుపైనుండరా - పండుయిరువైయైదుపర్వ

ములై యుండు - పరమగురు ధ్యానపరుల కేపండు॥తి॥ విత్తులేనిపండు విశ్వములోనుండు - సత్యముయీమాట నిత్యమయా - హత్తుగతల్లికి ఆబిడ్డమగడైతే సత్యముయీమాట నిత్యముగనుడీ॥ తి॥ కొమ్మలుకొన పువ్వులునుగూడివిబ్బి వీగుచునుండు మనిమంత్ర మనిమెటి మహిమతోడ - అల్లుడుకొడుకాయె-తండ్రి పెనిమిటాయె - అమ్మకూతురుచెల్లె అనుభవమైయుండు॥ తియ్య॥ ఆకులుపువ్వులు ఆనందముగపిండె లోకములో కాయ కాచియుండు - ఈకాయములో కాయపాకము తెలసి తెక్షణాలుచదివి తేకలమూకుపండు॥ తి॥ ఒరులకు యీపండు యొకదినుసుగానుండు - సొరులాకుయీపండు నమ్మకుండు - ధరిలోనయీపండు దాసులకై యుండు పరులకు యీపండుపంపుగాకుండు॥ తి॥ జనులులోకభేదమున చపలమైపొయ్యేరు - జననమరణములేని జాతిపండు - వాలాయముగపండు - ఓంకారమైయుండు - మాతల్లిమహమ్మాయి మర్మమేపండు॥ తి॥ అలుమగడురెండు ఆదిలేనినాడు కొడుకుకూతుపగన్నకొడుకేడిరా - అల్లుని తల్లియు హరిహరాదులగంటె - ముల్లోకములతోడ ముగ్గురునిమ్రింగె॥ తి॥ రేయిపగలులేకరవిచంద్రములునులేక-పంచభూతములులేక ప్రతిభూతమై - పదునాల్గులోకములుయేలుచున్న - సిద్ధగురునియొద్దనేయుండు॥ తి॥

(౩౧)—రాగము మోహన - అటతాళము.

పల్లవి.

ఏలయీదేహము పనికిరానిదెందుకీమోహము॥

అనుపల్లవి.

జాలమనెసంసార బంధములోనజిక్కి మూలమెఱుగని॥

చరణములు.

పంచేంద్రియములను తనలోశోధించి త్రుంచివేయకను చంచలము ఛేదించితనలోమంచి ప్రకృతి-అంచితముగ మంచివాడై గురునిపంచను పొంచికాచియుండ నేరని॥ఏ॥ వాడలోపలనుయేడింటినిజోడుగూడుకొని-ఆరుగూడుక మూడుదెలిసి - జోడుగూడియేకముగను - కాటుకపక్షులరెంటికదియబట్టి క్రమము తెలియని॥ ఏ॥ అష్టమదంబులనుయెల్ల ప్పుడు నిష్టదెలియకను -కష్టపడకనుయిష్టమెఱిగితె దెష్టలన్నియునష్టమగును - దృష్టిలోపలదివ్యనాత్మను నిష్టతో జూడంగనేరని॥ ఏ॥ మూటబెనగుచును ముమ్మూలము చోటుగానకను - మూడుమూడు ఆరుగడచి ము క్కీసతిని - అండజేరి - మోడివేసినకోడెపాము ను వేడుకతోనాడింపనేరని॥ ఏ॥ జ్ఞానమెఱుగకను మానాభిమానములోనబెనగుచును - కానరానికోనజొచ్చిసోముగూడిమేనుమఱచి తానుతానై సిద్ధగురునితల చిత న్మయ నుండనేరని॥ ఏల॥

(3౨.)—రాగము కాపి - చాపుతాళము.

పల్లవి.

కులమెంచగానేల గుణమెకారణము ॥

అనుపల్లవి.

కులబిందుకులమాయ కుల మెక్కువేది॥ కుల॥

చరణములు.

యోనిలింగము రెండుయేకమైతలచగా - యోని లోపిండమై వెడలినపుడే - యోనిప్రజాపతుల నెనసి పుట్టినకులము-ఘనమైనకులమేది కానికులమేది॥ కు॥ శుక్లశోణితముచేలిప్తమైనాకులము - శక్తిసహితమైన శ్వేతకులము-యుక్తిదెలుసుకగురుని-భక్తిసోహముగని-ముక్తిజెందినజనులు యెక్కువే కాదా॥ కు॥ చక్కగా భ్రూమధ్యసరణిగనుగొనలేక - యెక్కువని జెప్పుటది యేమికులము - ముక్కుతుదజూచిన మునులలెల్లబుషులైరి-నిష్కళంబెఱిగితేయెక్కువేకాదా॥కు॥ చావుపుట్టుకరెండు సమమని తెలియకను - తావుకొని యీషణత్రయబద్ధులైరి - పగలురాత్రులయూదు - ప్రణవమేమారకను శివయోగమెరిగితే సిద్ధుడేకాదా॥ కు॥ కశ్యపభరద్వాజగౌతముగార్గేయశుకశౌనకాదిమునిసుతులెవ్వరో -వ్యాసవాల్మీకాదివసిష్ఠుమొదలుగ - వాసిగాసిద్ధగురుడీశుడే కాదా॥ కులమెంచగా॥

(౩౩.) రాగము నాదనామక్రియ - చాపుతాళము.

పల్లవి.

మనసుమనసునబెనగి మనసుయేకముజేసి-
మనసు మర్మముగన్న దెఱుకా ॥

అనుపల్లవి.

కనుచూపులకు నడుమ ఘననాసికము గాలి
కదసి రెండొకటైన దెఱుకా ॥

చరణములు.

అక్షరంబులకాది అక్షరముతాదెలసి అక్షరముపరి

యించుటెఱుకా-అక్షరంబనుప్రణవమాలించిపీనులను అనుదినమువినుటయేయెఱుకా॥ మ॥ చీమయొక్కటికో టిసింహముల దిగమ్రింగి శిఖరమందుండుటే యెఱుకా- హేమవర్ణపుదోమయెనిమిదియేనుగుల వేగమున మ్రిం గుటేయెఱుకా॥ మ॥ వర్గములనారింటినైపు దెలిసితన లోనునిర్గుణంబై యున్న దెఱుకా - దుర్గుణంబులమూటి తొలఁగద్రోసి తనలోభర్గుడై ప్రభగన్న దెఱుకా ॥మ॥ క ప్పయొక్కటి మైదుపాములను దిగమ్రింగి కాలుదువ్వ చునున్న దెఱుకా-గొప్ప మొసలిని చేపచప్పరించుక మ్రిం గిచొప్పణగియున్న దే యెఱుకా॥ మ॥ షడుచక్రములఁగ డచినడిమివాకిలి దెరచి నాగేంద్రుడు లేపినదెయెఱుకా - ఇ డపింగళలుగడచి యీజీవహంసతో కూడికుంభకమైన దెఱుకా॥ మ॥ మేఘవురుములుతళుకు మేలై నర్ఘుడివా నయెడ తెగకకురిసినదెయెఱుకా - అర్ఘుడై నమాధుర్య మనుభవించుటసుఖము-అన్నిటినిమఱచిన దెయెఱుకా॥ మ॥ గంగయమునల నడుమ ఘనమైనమేడల్లో - అంగన తోగూడినదె యెఱుకా - రంగై నరవికోటికాంతులకు కాంతియైన - ఘనసిద్ధ గురుజేరు టెఱుకా॥ మనసుమ॥

—(అనిమి - పాపయ్యగారి కీర్తన.)—

(౩౮.)—రాగము కాఫీ - చాపుతాళము.

పల్లవి.

యోగమనరా - యోగమనరా ॥

అనుపల్లవి.

నాసికమందు - నడుపరాయోగం ॥

చరణములు.

వీనులయందువినరానాదం - కన్నులయందు కనరా బ్రహ్మం॥ యో॥ఆడెటిహంసనుజోడెడబాయక - వేడుకనాదముకూడుటయోగము॥ యో॥ వెలుపలలోపల వెలిగెడులింగము-నిలకడచేతనునిలుపరయోగము॥ యో॥నాదమెబిందువు నానారుచికళలు - పాదుగజేర్చెడుపరశివయోగము॥యో॥ కుండలిశక్తినికుదురుగనిలిపి-పండువెన్నెలలోనిండుటయోగము॥ యో॥ భక్తుడుఅనిమిపాపయపరమా-ముక్తినిజెందెడుభక్తులయోగము॥ యోగ॥

(జ్ఞానబ్రహ్మానందయోగులవారికీర్తన.)

(౩౪)-రాగము నాదనామక్రియ - చాపుతాళము.

పల్లవి.

జ్ఞానబ్రహ్మానందయోగి॥

అనుపల్లవి.

జన్మకర్మములెడబాపు - చిన్మయయోగి॥ జ్ఞాన॥

చరణములు.

చిత్తమనేపట్నమందు -చిన్మయుడనెరాజు రాజ్యము చేయుగాను - బుద్ధియనేమంత్రితోను - పురుషార్థమేమనితలపోయగాను॥ జ్ఞా॥ ఒడలునీళ్లతడపనేమి - ఊపిరి బిగబట్టియుండంగనేమి-జడలుధరింపంగనేమి - మాయాజాలముజేసితెజన్మపావనమా॥ జ్ఞా॥ బూడిదెబూసితేనేమి - వూర్ధ్వపుండ్రముబెట్టినపురుషార్థమేమి - మూడుగుణంబులకామి - తాముక్తుడుగాకున్న మునిసిద్ధుడా నా॥ జ్ఞా॥ ఆసగురునిపట్టవలెరా - పది - యాసగురుని బట్టిబంధించవలెరా - వేరొక్కటని తెలియవలెరా - తా

వెలుగైన తెరచాటు తానిల్వవలెరా॥ జ్ఞా॥ తొమ్మిదితూటులబాన - అది - కల్మషములకెల్లదాపైనగూన - వమ్మరాదురగురుడాన - యిది - నాశవముజెందునునానావిధాలా॥ జ్ఞా॥ తొమ్మిదితూటులుమూసి దొంగలుండెడుచోటెల్ల శోధించి తెలిసి-తుమ్మెదనాదములెంచి-తానుతుల్యమైనస్వానుభవమొందవలెరా॥ జ్ఞా॥ సతిపతులిద్దరుగూడిచాల-రతిసేయగశుక్లశోణితములుగూడి-సుతుడాయెగర్భమువీడి-దాన-సుఖమేమిలేదురాపరికించిచూడ॥ జ్ఞా॥ తల్లిదండ్రులు-అన్నలున్న-మరితమ్ములుబావలుతగచుట్టుకొన్న-ఎల్ల బంధులుగూడియున్న తానుతల్లిపొయ్యేవేళతనకెవ్వరన్నా॥ జ్ఞా॥ పరబ్రహ్మమేసత్యమారా-పరమానందరసమే పానముచేయవలెరా-గురుపాదమేజేరవలెరాదృఢమైనతత్వముతాదెలియవలెలా॥ జ్ఞా॥

(వీరలింగ గురువులవారి కీర్తన.)

(3౬.)—రాగము ధన్యాసి - ఆదితాళము.

పల్లవి.

ఎవరని యడిగితె సిగ్గాతున్నది ॥

అనుపల్లవి.

ఏమనిజెప్పుదు వినరయ్యా ॥

చరణములు.

నేత్రకారుడై లోకములోకి - మూత్రపుగవినిదాటొస్తినయా॥ ఎ॥ మొట్టమొదలుపుట్టినచ్చినవూరు - ఉచ్చగుంటలోనునికయ్యా - ముట్టుమైలనే యిరువుజేసుకొని యిష్టముగానేనుంటినయా॥ ఎ॥ తల్లిదండ్రుల మ

దమునబుట్టినత_త్తరతనువని తెలియరయా - తానుయొ
ల్లనియేహ్యముల్లోపల-తాపొట్టలో నెపుట్టివ_స్తినయా॥
ఎ॥ శుక్లర_క్తములుచుట్టుకొన్నవి యెవరనియడుగనేము
న్నదయా - చీముపుసులునుచ్చిప్టము రోతలోచుట్టుచె
కలోనుంటినయా॥ఎ॥ బూతుకుపుట్టినపీతిరిబుట్టిది సాతు
శాయయేమున్నదయా - పిత్తుతేపుల దో త్తరిబొమ్మలో
పె_త్తనగాడై యుంటినయా॥ ఎ॥ తొమ్మిదికిటికిల మేడలో
పలక_ర్మరహితమైయుంటినయా - తమ్మివీరలింగంబు స
ద్గురుని - నమ్మిసేవచేస్తుంటినయా॥ ఎవర॥

(ఏగంటివారి కీ_ర్తనలు.)

(౩౭.)—రాగము శహాన - అట తాళము.

ప ల్ల వి.

ఇదిగో గంగాయాత్ర - యింటిలోనుంది ॥

అ ను ప ల్ల వి.

ఒంటి తెలిసినవారి కంటునీయాత్ర ॥

చ ర ణ ము లు.

ఎటుక మఱువుల రెంటి నేకంబుగాజేసి ఊర్ధ్వస్వరం
బనేభువిలోననుండి-పంచవింశతినదులుభాగీరథీగంగపం
చశోశములందు విశ్వనాథుడుండగనూ॥ ఇ॥ నేత్రకనుల
మునందు కాలభై రవిదుర్గికా శీకురుక్షేత్రమేగ యాత్రప
యాగాదానధ_ర్మముయజ్ఞజపతపస్వాధ్యాయక్రతువుల
నుమించినదికమలమధ్యంబు॥ ఇ॥ పదునాలుగుభువనము
లుపారుచుండెడిగంగకుండలీ మధ్యమువనిండియుండు-
దండిగాతనలోనతథ్యమైయుండగా కొండనీళ్లకునేల కో

రేసునరులు॥౩॥స్థూలదేహమెకాశి-సూక్ష్మదేహమెమణి
కర్ణికాకారణాదేహమెకావిడేతీర్థం - సుజ్ఞానమనేబాట
సోహరామేశ్వరం - సేతులింగస్నానంసేయుడభిషేకం॥
౩॥ తిరిగిమళ్లినియాత్ర తెలుసుకోనేలేరుతిండిపోతులకె
ల్లతీర్థయాత్రలును-స్థిరముగాయేగంటిగురుకృపకలిగితె
దిశలుభువనంబులును తేజరిల్లగను॥ ఇదిగో॥

(౩౮)—రాగం నాదనామక్రియ - ఆటతాళము.

పల్లవి.

చేతులకందవురెండు-శివనీతులుచెప్పంగవిందురటన్నా।

అనుపల్లవి.

చేతులకందవురెండు-శివనీతులుచెప్పంగవిందురటన్నా॥

చరణములు.

ఊరిపడమటనొక్క పాములేనిపుట్ట పుట్టలోనయూ
రపిచ్చికట-ఉట్టిమీదనొక్కపూసరవెళ్లియట - పట్టిడేసి
వెన్నమెక్కునటన్నా॥ చే॥ మొదలులేనిమ్రాను - ఆకు
లేనితీగ - తీగతీగకు అయిదుకొమ్మలటా - మొగ్గలేనిపిం
దె తొడిమలేనిపండు - నోరులేనిబాలమ్రింగెనటన్నా॥
చే॥ గుజ్జుముయెనుబోతు కూడిచరించగనట్టెడ్లమీదనడు
చునటా-ఇట్టిపోతుజింకమట్టిమ్రానుమీదనమలకయా
బయల్ మేసునటన్నా॥ చే॥ గుఱుతుగయేగంటి గురు
కృపకలిగితే - గుఱుతుగనంజయ్యదెల్పునట-శివునిభక్తు
లైతే-శివునిసన్నిధికి-జేరుమని శివుడుచెప్పునటన్నా॥చే॥

(౩౯)—రాగము కాంభోది - ఏకతాళము.

పల్లవి.

కంటిమయ్యా కైవల్యము - కన్నులయందు ।

అనుపల్లవి.

వింటిమయ్యా - ప్రణవనాదమువీనులయందు॥ కంటి॥

చరణములు.

చూపులోచూడంగాను చిన్మయరూపమున్నది - ఆ రూపులోనె బ్రహ్మాండమంతవ్యాపించియున్నది - రేపు మాపులేనివెలుగువెలుగుచున్నది - ఆ - పాపలందెపరమపదమువయలైయున్నది॥ కం॥ గుండ్లరెంటినడుమనక్కకూయుచున్నది - ఆ-గుండ్లుత్రిప్పిచూడపరమగోప్యమున్నది -గవినియొద్దమొసలిదెయొకతెకావలియున్నది- ఆగవినిగడచినముక్తికాంతయున్నది॥ కం॥ ఆకులేని ప్రమానుమీదకాకియున్నది - ఆ-కాకిముక్కులోనె బంగారమున్నది - బంగరంపుతీగమీదకొంగయున్నది-ఆ-కొంగముక్కులోశివలింగమున్నది॥ కం॥ నూతిగట్టుతుదను నెక్కనాతియున్నది - ఆ - నాతినెత్తిమీదపెద్దకోతియున్నది-కోతినాతిమీద పరంజ్యోతియున్నది-ఆ-జ్యోతియందెయేగంటీశుడుస్థిరమైయున్నాడు॥కంటిమయ్య॥

(౪౦.)—రాగము ఆనందభైరవి - ఏకతాళము.

పల్లవి.

సంధ్యవార్చేవిధము సంమతెలియండీ।

అనుపల్లవి.

సంధ్యతెలియనివాడు సద్బ్రాహ్మణుండగునా॥ సంధ్య॥

చరణములు.

సంధ్యవిస్సంధ్యలనుబొందిలోనెయుండు- బందెసం

ధ్యలుమానిపై సంధ్యగనుడీ॥ సం॥ అదినీలతో యదమ
ధ్యస్థాదినుకళ-అదియవిద్యుల్లేఖ-అనగమరియుఁ॥ సం॥
అదియనీవారశూకాగ్రగసూక్ష్మంబనుట విదితాపోజ్యో
తిఓంకారమాయెఁ॥సం॥ ఓంఇత్యేకాక్షరంబనిచక్షులన
డుమను జేరివినరాదా - చక్షువేమనను మనసేచక్షువు
చంద్రమామనసోజాత॥ సం॥ చక్షుస్సూర్యో అజాయతే
యని - అజనుతయేగంటిగురుకళనెరుగరాదా॥ సంధ్య॥

(౪౧.)—రాగము ముఖారి - ఆదితాళము.

పల్లవి.

గుట్టుదెలిసి తెలుసుకొనరె - సుజ్ఞానులార॥

అనుపల్లవి.

బట్టబయటనుండుదీని - భావమెల్లను॥ గుట్టు॥

చరణములు.

గండుపిల్లిలోకమెల్లా - గారవించియేలగాను - కొం
డమెలుకలొక్కరెండుకొలువుజేసేరా - అండబాయక
చిలుకలైదుఅరిదిగాచుకుండగాను - పందుకోతులొక్క
రెండుప్రహరితిరిగేరా॥ గు॥ ముప్పుప్పుగొడ్డురాలి మూ
తినొక్కకొడుకుబుట్టి - గొప్పకొండలేదుమ్రింగిగుటకవె
ట్టేరా - ఉప్పుచప్పుయనకనొకడుఉరికెమింటికెగయుగా
ను - కప్పగంతులేసితొలికఱచిచంపెరా॥ గు॥ భువినినో
రులేనిమిడతపులినిమ్రింగెనమ్మదాని వివరమెఱిగియొక్క
నక్కవికవికనవ్వేరా-అవిరళముగదెలిసిచూడ-అలవికా
దుయెవరికైన-తలపయేగంటిగురుడుతానెతెలునూరా॥

(౪౨)—రాగము నాదనామక్రియ - ఆదితాళము.

పల్లవి.

పంచరంగులిదిబొమ్మ - దీనిభావముతెలుసుకొమ్మ ॥

అనుపల్లవి.

ఎంచగపంచభూతములైదుపపుచునున్నవిఎంతటివారిని

చరణములు.

మంటిదిరాయింబొమ్మ-దీనిమర్మముతెలుసుకొమ్మ-ముక్కిదిరాయిడొక్క-నీవు-మురియకువే - వెఱ్ఱికుక్కా॥ పం॥ నిర్మలమతితో - మర్మముదెలిసియు - నిర్మలమెంచిగిన - సద్గురుగనుమీ॥ పం॥ ప్రపంచమంతా చెండి -పరమాత్ముని - మదిలోనుంచి - ఇరువదియైదవతత్వముగను మీ-యపరాధునియపరాధునియనుమీ॥ పం॥నిక్కముగానుమీ - నిటలాక్షునిమదిలోకనుమీ-సత్యముతెప్పక - చావకబ్రతికెవు-నిత్యానందమునిలకడగనుమీ॥ పం॥ నవధర్మాజులకోట-నిటలాక్షుడునిలిచేచోట - దిట్టముగాయేగంటీశ్వరు - నిష్ఠతోనిలిచిననిర్మలచోట॥పం॥

(౮౩.)—రాగము దేశికతోడి - రూపకతాళము.

పల్లవి.

కోరికోరిపరమగురుని కోరిచేరరే।

అనుపల్లవి.

కాలకర్మజన్మములను కడకుజిమ్మరే॥కోరికోరి॥

చరణములు.

కాలిమడిమగుదమునందుకదలకుండనెత్తిపట్టి-మూలబంధతత్వగతినిమురియుటెవ్వరే॥ కో॥ కంటిలోనయింటినడుమకంటిలోనుకన్ను దెలిసికంటిపాపనంటిపెనగుమ

నులుయెవ్వరే॥ కో॥చూపులోనెచూపుదెలిసి చూపులోనెరూపుచూచి - చూపులోనె సుఖముపొందె శూరుడెవ్వరే॥ కో॥ నాదపంచకంబు తెలిసినాదపంచకంబువిడిచి - నాదలయముజెందినట్టినరుడుయెవ్వరే॥ కో॥ ప్రాణాపానవాయువులనుపరగనై వేద్యంబుచేసి - పూనికాయసిద్ధిపొందెడుపుణ్యులెవ్వరే॥కో॥మాటలాడక అమృతమనెడుమేటిబ్రహ్మరంధ్రమునను - మేటిహంసతోనుగలిసిమెలగుఔవ్వరే॥కో॥ పరమగురుడేగంటిభవ్యలింగమూర్తికరుణ - పరమలింగసుఖముజెందు ఘనుడుయెవ్వరే॥ కో॥కో॥

(౪౪.)—రాగము ఇంగ్లీషువర్ణమెట్టు - ఆదితాళము.

పల్లవి.

కంటిపావలంటరా మాటనాల్గింటరా॥

అనుపల్లవి.

నాల్గింటలయిదింటఆరింటఅరసిచూడరా॥ కంటి॥

చరణములు.

ఎక్కడానిమ్రాని కొమ్మనెక్కపండుపండెరా - పండెనదినిక్కిచూచి చిలుకలైదుగనచేరా - పెక్కుచిలుకలాకుపిల్లినెక్కచోటపొంచెరా - పొంచెననినిక్కిచూచి కుక్కలైదుమొరిగేరా-చోద్యమైనగొప్పపిల్లరాజ్యమంతా మేసెరా॥కం॥బింబమైనా పిల్లికూనపెద్దపులిని మ్రింగెరా - వీధిలోపొయ్యెయెలుక పిల్లవీరభద్రుని మ్రింగరా - చీమదోమ కూడుకొని మిద్దెలుమేడలుకట్టెరా - మిద్దెమీదకస్యపడుచు పెద్దకూతపెట్టెరా - మూగవా

డు వేదమెల్ల మొదటినుండి చదివెరా॥ కం॥ ఎండనీడ లే నిచోటనుండే ఉఊయములుచూసరా - పాముకాటువిష ములేక-కాటు - అందుటచూడరా - మూడులోకములు యేలే ముసలికోతియొక్కటి - చోద్యమైన ఘంటయ్యను దేవుడనినమ్మరా॥ కంటిపాప॥

(కంబగిరివారికీర్తనలు.)

(౮౫)—రాగం నాదనామక్రియ - అటతాళము.

పల్లవి।

అడిగినప్పుడె చెప్పగూడునా -
బ్రహ్మానుభవము-ఆత్మానుభవము ॥

అనుపల్లవి.

అడిగినప్పుడె చెప్పగూడునా -
బ్రహ్మానుభవము - ఆత్మానుభవము ॥

చరణములు.

అడిగినప్పుడె చెప్పుటకునిది - పడుచులాటలభ్రాంతి జన్యము - లుడిగినిర్మలమైన మాయనుగడచి నిలచిన స్వానుభవమిది॥ అ॥ టక్కునగుసంసారజలధిలో - ము క్కుముంచుక మునుగకిందులో - చిక్కిపొరలుచు నిం ద్రియంబులటక్కరణచియున్న పెద్దలు - పెక్కుసం సారముల్ విడిచిరే - మోక్షంబుకొఱకై - చక్రవర్తు లునగరుల్ విడిచిరే - రాజాధిరాజులు బ్రొక్కిగురుని పంచగాచిరే - ఋష్యాదులూరక దిక్కుదెలియకనడవి కేగిరే - నిక్కముగ మోక్షంబు జెందెడి - నిలుకడొ క్కటిలేక యిప్పుడు - దక్కినట్టుగ మాటలాడి - దయ

కుపాత్రులమన్నమాత్రమె॥ అ॥ తనువుధనమునుసంపద యుతానెనసియుండి గురునికొసగక - వెనుకవెనుకనుగా చుకొనిమరిదినదినంబునుసేవచేయక-గుణములవిమూడ ణగిపోవునా - జీవేశ్వరులకు గుణములణగెడితావుదెలు సునా - ఆవరణములనుబెనుచుకొనిపై దేలనిచ్చునా- అరిషడ్వర్గములను - దుందుడుకలుగపడదన్నకుందునా- అనయముతద్భోధితంబగు- ఆత్మతత్వములెఱుగజాలక- శునకముగతనబుద్ధిదిరుగగ మనసు నిలుకడలేనివారికి॥ అ॥ కొంటెగురువులశిష్యవర్గమువెంటదగిలి బాధసేయుచు - తుంటమాటలునేర్చిసాధుల - గెంటెజేయుచురంటుకొని బల్ తంటతగువులబాధచేతురు - మీరెంతమీకంటెమేమె యెక్కువందురు - గోవింద - అజ - ముక్కంటి - మాపనివారలందురు - ఇటువంటివారలు యింటయింటనుయెత్తుకూళ్లదింటు - తమమనసువచ్చినట్టుగ-కంటుకువాదంబు లుడుగని కొంటెలకును దుర్మార్గజనులకు॥ అ॥ బుద్ధిచాలకసేయుబోధిది - సిద్ధమగుశ్రీకంబగిరిని - శుద్ధమల్లనరహరిపై - బుద్ధినిలకడలేనివారికి॥ అడిగినప్పుడెచెప్పగూడునా॥

(౮౬.)—రాగము నాదనామక్రియ - చాపుతాళము.

పల్లవి.

రామభజన సేయరా - లమిడీకా ॥

అనుపల్లవి.

నీ - తామసమణచర - ధగిడీకా॥ రామ॥

చరణములు.

ధూముధాములేమి చేయునోము కొన్నఫలమేకా ని-తామితాముతరలి పోయ్యేదారియైతె తెలుసుకోర॥ రా॥ కండ్లక్రొవ్వుచేత నిట్లు తిండిపోతులనుగూడి-ఉండబట్టక అరుగబోతే గండమేలతప్పునయ్య॥ రా॥ తల్లి పిల్లయిల్లువాకి లెల్లమాయకల్లగాని - దొర్లదోసి యముడుచాల కర్లగొట్టి పొర్లనేయు ॥రా॥ టక్కుపిక్కులాడిముచ్చు కుక్కరీతి మెఱుగవద్దు - జక్కలేటికంబగిరిని చక్కనయ్యనష్టిమ్రొక్కు ॥రామ॥

—*(పూదోట బ్రహ్మంగారి కీర్తనలు.)*—

(౪౭.)—రాగము సురట - ఏకతాళము.

పల్లవి.

అదిగోచూడవె మనస - ఆత్మలోముక్తి॥

అనుపల్లవి.

పదిలముగసాధింప బ్రహ్మంబెతానగును॥

చరణములు.

బ్రహ్మబ్రహ్మంబనిభేదించికొలిచెదరు - బ్రహ్మబ్రహ్మముగాదు పరగంగవినుడి- బ్రహ్మబ్రహ్మంబైతె కుమ్మరాకారమున - బొమ్మలనుజేసుకొని తానమ్ముకొనునా॥ అ॥ విష్ణుబ్రహ్మంబని యిలయందుకొలిచెదరు - విష్ణుబ్రహ్మముగాదు విశ్వంబులోను - విష్ణుబ్రహ్మంబయితె కృష్ణావతారమున - విటకత్తెలనుగూడి తాకష్టపడునా ॥అ॥ శివుడుబ్రహ్మంబని సృష్టిలోగొలిచెదరు - శివుడుబ్రహ్మముగాదు సిద్ధంబుగాను - శివుడుబ్రహ్మంబైతె శిరముచేధరియించి-కాటిలోపలశివుడుకలియదిరిగిపోనా॥ అ॥

ఆరుమూటినిదాటి మేరుశిఖరముమీద - ధీరముగవెలి గెడుధీవరేణ్య - పదిలముగపూదోట ప్రభువునంటినయ పుడె - ఘనమైనమోహాబ్ధికడనీదబడుదు॥ అదిగో॥

(౪౮.)—రాగము కాఫి - చాపుతాళము.

పల్లవి.

అదిరాము క్షేత్రోవ - ఇదిరానాధించు।

అనుపల్లవి.

పదరాయిూబూటకంబో ప్పదురానాకుదికి ॥అ॥

చరణములు.

వదలకగురుకోల్వవలెరాసెఱనమ్మి - పదపడిలోచూ పుచెదరనియ్యకురా॥ అ॥ బొమ్మరింటిలోమంచిసొమ్ము- ఉన్నదిరా- ఆసొమ్ముదక్కించుకోనుకనూటియున్నదిరా॥ అ॥ ఆరువాకిళ్లుమూసి అందురొందవినుచు-పఱులుకూ డినచోట యేకాంతమునను॥ అ॥ ధీరతనమున సన్నది డ్డదూరెదవు - కాఱుచీకటిలోను కదలకటునిలిచి॥ అ॥ పొలుపొంద గురుబోధభూతియెగఁజల్లి- తెలివిచే చీకటి గూట దివ్వెమ్ముంచి ॥అ॥ తెలతెలతెల్లవాఱభానుడు దయించె - అలపట్టపగలై చుక్కలుగనుపించె ॥అ॥ చెలరేగికళలతో చంద్రుడుదయించె- అలవీరపూదోట రామన్నయితడు॥- అదిరాము క్షేత్రోవ॥

→※ (ఇంద్రదపీఠ - భీమన్నగారికీర్తన.) ※←

(౪౯.)—రాగము భైరవి - చాపుతాళము.

పల్లవి.

సత్యమైన బ్రహ్మముగానవలెరా।

అనుపల్లవి.

నిత్యమైన బ్రహ్మంబెతానవరా॥ స॥

చరణములు.

సత్తుచిత్తులొక్కటి సేయవలెరా - వత్తిలేనిదీపము వెలుగవలెరా - నిత్యగురుని భజించగవలెరా-సత్యమే మోక్షానందమేగదరా॥ స॥ సూటిగలసాధువుల నమ్మవలెరా - బోటులతోపొందు మోటాశవిడరా - కోటి విద్యలు కూటికేగదరా - కాటికేగేదెకాయముగనరా॥ స॥ కోపతాపకర్మములెల్లవిడిచి - చీపురటువంటి మాయనుగెలిచి । తత్వమసియనువాక్యమేదలచి - మత్తులగుమానవాసంగమిడిచి॥ స॥ అహల్లోకంబులను జెఱచె మాయ - మాయమరుపందె బహుజీవులాయ - పాయకనుబద్ధులైతిరిగేరాయ - బ్రహ్మమునుగాన యెవరులేరాయ॥ స॥ అంగమునునాల్గింటనుశోధించండి - అంగలింగేశ్వరుని గనుగొండి - గంగయమునన్నదులదాటండి - నిగమాంతవేద్యునిజ్ఞప్తిమీటండి॥ స॥ ఇంద్రపీఠభీషున్నార్యులోరి - బుద్ధిమంతులైవినరోరి-పామరులనుగూడి చెడిపోకురోరి - భీమయొఱుకే దైవము తెలియరోరి॥ సత్యమైనబ్రహ్మము॥

(చిత్తూరు నరసింహదాసుగారి కీర్తన.)

(౫౦.)—రాగము హిందూస్తానిభాళి - ఆదితాళము.

పల్లవి.

ఎక్కడఁజూచిన బ్రహ్మమయంబని
చక్కగనెఱుగును-సుజ్ఞాని॥

అనుపల్లవి.

అక్కరబడి వేమన్నగురుఁజేరక-
తుక్కైమెలఁగును-అజ్ఞాని॥

చరణములు.

వాదభేదములు - అణచిసద్గురు - పాదముఁజేరును-సుజ్ఞాని - మీాదనున్నఘనచేతఁమెలఁగక రస - వాదముగోరును-అజ్ఞాని॥ఎ॥ జ్యోతినిరామయభ్రూమధ్యంబున-ఖ్యాతిగగాంచును- సుజ్ఞాని। కోతివలెనేవెఱ్ఱిచూపులుచూచుచునీతినిమాను-అజ్ఞాని॥ ఎ॥రాక్షసభూజనకూటమునంటక-మోక్షముజెందును-సుజ్ఞాని-దీక్షలుపెంచియుపేక్షవిడువకయుమ-శిక్షితనొందును-అజ్ఞాని॥ ఎ॥ దూషణ భూషణ దేహంబనుకొని - రోషముద్రుంచును-సుజ్ఞాని। వేషధారుఁడైమానకరాగ-ద్వేషముఁనుంచును-అజ్ఞాని॥ ఎ॥ చిలుకవలెను చిత్తాత్మశివునితో-పలికినవాఁడే- సుజ్ఞాని॥ పలుమఱు వరకవి నరసింహదాసునితలఁపనివాఁడే-అజ్ఞాని॥ ఎక్కడ॥

(౫౧.)—రాగము ధన్యాసి - ఆదితాళము.

పల్లవి.

మాయను నరికే మర్మము ఉన్నది
న్యాయమువినవే - ఓమనసా।

అనుపల్లవి.

కాయములోపల- ఉపాయముకనుగొ
మేయవలెఁగాపరమే-ఓమనసా॥ మా॥

చరణములు.

అండపిండ బ్రహ్మాండములన్నియు కుండలియనవే ఘోమనసా - దండిభావమిదిదారిజూపితినిముండమోపి వలె నుండకేమనసా॥ మా॥ చెట్టుమెక్కుటకుగుట్టుతె ల్పెదను పట్టుపట్టవేఘోమనసా - పట్టువదలకను బ్రహ్మ మునీలో ముట్టివిడువవలె ఘోమనసా॥ మా॥ తంటల మారివై కంటిచూపులో-అంటిచూడవలెఘోమనసా- కొంటెతనము ఆరింటవిడిచిగురి-నంటి చూడవేఘోమన సా॥ మా॥ తిరుపతి వెంకటరమణుడెగురుడని యెఱుక కనఱువకేఘోమనసా - ధరణిలో నరసింహదాసునివా క్యము-పరమనివినవేఘోమనసా॥ మాయనునరికే॥

(౫౭.)—రాగము మధ్యమావతి - చాపుతాళము.

పల్లవి.

నాదంబతి జాగ్రతగా విను మనసా -
సాక్షాత్ సద్గురు ప్రణవ నాదం।

అనుపల్లవి.

నాదంసద్గురుబోధం సంశ్రుతివేదం అక్షరభేదం।
దశవిధనాదం-బతిజాగ్రతగా వినుమనసా ॥

చరణములు.

ఇరుగిరులకుపైగానెక్కి - వినుమిక్కిలిగాగురునికీలక మునదక్కి - యిరుగిరులకును-ఇష్టదైవమును-చిఱునగున గుచుచు-చిత్తదృఢంబునపురమునువెడలి - పరమునుజే రి-సరిగరిగరిగరిసింసోహంబనుచును॥నా॥ కంటిపాపనుక ట్టివేసి - కర్ణములను జంటబాయకకట్టికోసి - కంటిపా పనుకిలనుగపెంచి-మంటిబొమ్మనుమిణుకుగదిగ్గి - గుంట

నక్క_ను కూయక గట్టి- ఘంటానాదముఘణఘణవ్రాచుచు॥ నా॥ పట్టువిడువక పట్టుబట్టి- పక్వముతోడనుపిట్టను బట్టిబిగియకట్టి-పట్టువిడువక పరమహంసనుతిట్టుతిట్టక-తియ్యనిఫలములు-, చెట్టుపైగను చేరిచరింపుచు-దిట్టముగా యిలధింధిమియనగా॥ నా॥ ధరనుఘటికాద్రియందునిలచి యున్న మహాత్ముడైన - హరినిమదినిదలచి-ధరలోధగధగ మెఱయుచుముక్తిని - సురలుమెచ్చయీనరలోకంబున- చెఱుకుపాలు చెల్ చెల్ మనగను- సరసింహదాసునిచేరిభజించి॥ నాదంబతి॥

(౫౩౦)_రాగము ధన్యాసి - చాపుతాళము.

పల్లవి.

కామముకురచే నీమముయున్నది -

రామరామరామయను-ఓమనసా।

అనుపల్లవి.

ప్రేమతోసద్గురు వేమనచిన్మయ

నామమునమ్మవే - ఓమనసా॥ కా॥

చరణములు.

నీవునేను అనుబహువచనార్థములుతావు తెలియవే- ఓమనసా- దేవుడైనపరమాత్ముడౌనిరంజన దేవునెఱుగవే- ఓమనసా॥ కా॥ ధనధాన్యంబులదలచగనేటికిఘనముకా దెఘీవిడుమనసా-మానక ఆత్మధ్యానమె మనకుమూలై యున్నది-ఓమనసా॥ కా॥గురునిగూడిసదానాడులదిరుగుచు స్మరణజేయవే- ఓమనసా - తరుచుగనీవును తన్మయమందుచు మెఱువక నిలువవే-ఓమనసా॥ కా॥ దరణిలో చిత్తూరిపురమునకరిగిరి - వరదునికోరవే-ఓమనసా॥ కా॥

(౫౪.)—రాగము ముఖారి - ఏకతాళము.

పల్లవి.

జీవమా - మాయాజీవమా ॥

అనుపల్లవి.

జీవమా - మాయా జీవమా ॥

చరణములు.

జీవమానీకెంత దెల్పినదోవ తెలిసినదువవేమి- కాహార
ముఅణచి సద్గురు భావమందునిలువవేమి॥జీ॥ ఆశలనేల
హాముపిడచియాశతో శ్రీరామభజన - నాసికావనము
చేరిదాశరథేయనవేహోవ॥ జీ॥ నీతిమార్గులను వెతకి నీయు
వస్థలన్ని విడిచి - వ్రాతఫలము తెలుసుకొని వాక్కుమా
సిధ్యానమాడవె॥ జీ॥ ధరణిపై శ్రీనరహరియనిమాపురే
పుయొక్కటిగ -నాదబిందుకళలయందు నాట్యముద్రో
క్కంగరాద॥ జీ॥ తిరుపతిమాంపాహి వేంకటగురునినీ
లోగోప్యముగను ధరణిలో నరసింహ్మదాసుని - పరమ
చిత్తదృఢముజేసి॥ జీవమా॥

(నరనారాయణ దాసులవారి కీర్తన.)

(౫౫.)—రాగము దేశికతోడి - రూపకతాళము.

పల్లవి.

బ్రహ్మజ్ఞాని గురుతు లీకితుందు ।

అనుపల్లవి.

జ్ఞానఖడ్గముచేత నజ్ఞానముఛేదించి - మానసమునపంజ-
మమతలీడిన బ్రహ్మజ్ఞానిగురుతు లీకితుండు ॥

చరణములు.

మదమత్సరములనుమాయపరచియు-నిష్ఠ- చెదరక మనసునిల్వఁగ్రఁటేరురా-దృష్టి-చెదరకచిత్కళలంటేరురా అంటి-ముదురువెన్నెలబయలుగనియేరురా-పూని-యె దురులేకనులయమయ్యేరురా- నిదురజెందినరీతి నిలచి నయోగికి - గదలెతెప్పలపాటు వదిలుండురా॥ ప్ర॥ అ శాపాశము లేనియనుభవజ్ఞానికి-మోసబుద్ధులువానిజే రవురా-జంట-శ్వాసముల శబ్దమణగుండురా-దాని-వా సమేగురు స్థలమనియుండురా - దేహ - వాసనవిడిధర నుదిరిగేరురా - కాసులమీఁద నిరాశజేయుచు - పర- మేశానందముబొందియెఱుకై యుండిన॥ ప్ర॥ బాలో న్మత్తపిశాచగుణములతో - లీలజేయుచు ధరనుదిరి గేరురా-వానికి-కాలునిభయమెందు లేకుండురా - చి న్న - నీలతోయదమధ్యనిలచేరురా - అందువాలలాడు చుము క్తిగోరేరురా - గాలిమనసు దృష్టికదలకుండిన వాని-కేలోకమునభయమేముందిరా॥ ప్ర॥ సాధుసంగ ముచేసి భేదవాదముమరచి-నీదినాదను సొంతంలేకుం డురా - వానిపాదాలపై కాయగ్గాచుండరా - దేహం- నాదికాదని మఱచితిరిగేరురా-యెంతో - బాధలైనను సంతోషించేరురా-బోధవేదాంతసిద్ధాంతమతములనే - వాదులసాంగత్యం విడిచేరురా॥ ప్ర॥ ధరనుసద్గురువుల లరచిచూచితేవారి పరిపూర్ణ యనుభవమిట్లుండురా- త్రోవ-యెఱిగినవాడెగురైఁటుగునురా - లోక - నరుల కుయిదియంధకారమురా-నిజ - వరయోగినడిచె త్రో వయిదియేనురా - వరనారాయణ దాసువివరమిట్లుండ

గగుఱిలేనిగురుసంఘంగొననేలరా॥ ౹బ్ర॥

⟶ ※ (నారాయణ గురువులవారి కీర్తనలు.) ※ ⟵

(౫౬.)—రాగము వరాళి - ఆదితాళము.

పల్లవి.

మాయను నఱికినవాడు గురురాయనితో జతగూడు॥

అనుపల్లవి.

పాయుచువిషయము రోయుచు సతతము
యేయెడచూచిన యేకముతానై ॥ మా॥

చరణములు.

కుండలినటుభేదించి - అఖండముగభావించి - అండపిండబ్రహ్మాండములంతట నిండిపండియానిర్వికల్పమున॥ మా॥మూడారువాకిళ్లుమూసి - ఆమూలకవాటముదీసి- ఇడాపింగల జోడుగూడుకొని మూడస్ఫడచి - ఆమూలముతానై ॥ మా॥ ఆధారమున రేచించిమణిపూరకము నకుంభించి - రినకోరికలన్నియు నివారణజేసెడు నారాయణగురుపారాయణచే॥ మాయను॥

(౫౭.)—రాగము నాదనామక్రియ - ఏకతాళము.

పల్లవి.

ఆనందమయుడుగావలెను॥

అనుపల్లవి.

పూనితానుతానై యున్న - తావుగనవలెను॥ ఆనం॥

చరణములు.

కామములకడకొత్తవలెను - అష్టసామజంబులమదముసనుయింపవలెను॥ ఆ॥ ప్రేమసద్గురుజేరవలెను - దు

ష్టతామనపుదుర్గుణము తొలిగింపవలెను॥ ఆ॥ సత్యమేమ దినిల్పవలెను-అసత్య దేహముమీద -ఆశవిడువవలెను- భక్తిమదిలోనిల్పవలెను-జీవన్ముక్తిమార్గముతా ముం దెఱుగవలెను॥ ఆ॥ అక్షరాత్మకుడుకావలెను - మూడ క్షరంబుల భావమది తెలియవలెను - దీక్షాధికారికావ లెను - మోక్షకాంక్షచేతను సద్గురుజేరవలెను॥ ఆ॥ ని ద్రరాకడ దెలియవలెను-దానిభద్రపఱచుక యోగనిద్ర బోవలెను - చిద్రూపమిప్పుడె కనవలెను- ఖేచరీముద్రకీ లెఱిగి సద్గతిపొందవలెను॥ ఆ॥ వేషభాషలుమానవలె ను-తన్నుదూషించువారిని భూషింపవలెను – కాషాయ ధరుడుకావలెను- నాదఘోషవీనులయందు ఘోషింప వలెను॥ఆ॥చూపుమనసొగటిగ జేయవలెను –సర్వ-వ్యా పకుండై చిన్మయూత్మగనవలెను–మేడమీదికి జేరవలె ను-అచట-జోడుబాయక హంసజాడ గనవలెను॥ ఆ॥

(౫౮.)—రాగము - మధ్యమావతి -ఏకతాళము.

పల్లవి.

అంతాచిన్మయ అఖండమద్వయం
ఆనందోబ్రహ్మానందం॥

అనుపల్లవి.

వింతగాను అనుభవమంతయు దెలసి
యంతరాత్మనుచింతసేయువే॥ అంతా॥

చరణములు.

స్థూలసూక్ష్మములుతానై సుకరంబై సురసేవ్యంబై -
ఫాలభాగమున బహుగోప్యంబై పావనమై ప్రత్యక్షం

బై - మూలబ్రహ్మమై సుక్తిపదంబై మూటిమూటి మూడావలతానై - కాలాకాలంబై కళాతీతమై కళ లుమించి చిత్కళలువెలుంగుచు॥ అ॥ పంచబ్రహ్మమై పంచాక్షరమై పంచభూతమై ప్రణవంబై పంచపంచ యిరువై అయిదులుతానై - పంచవాక్యములు పంచ శూన్యములు అంచితముగ అభిమానముతానై॥ అ॥ రక్తశ్వేతనిరాకారంబై రమ్యంబై ధూమాకృతియై - ముక్తిపురమున మూర్తిత్రియముగ - సుదమునజూ చెటిముగ్గురిలో - శక్తిసహితమై శివమై పరమై శాం తంబై షడ్భావంబై వ్యక్తింబై- వేదాంతసారమై - వె లుగులోపలవెలుగుచున్నది॥ అ॥ ఏటికియూరక భ్ర మయుమంపుమను - ఎఱుగరుతములోనుండగను - నా టకధారుడు నారాయణుడై - కోటిసూర్యుల కాంతుల తో వెలుగుచు॥ అంతాచిన్మయ॥

(౫౯.)—రాగము ధన్యాసి - ఆదితాళము.

పల్లవి.

మోసపోకమూడాశలు - మొదటనేకోసివేయవలెరా॥

అనుపల్లవి.

దేశములోపరదేశికుడుండే - వాశిదెలియవలెరా॥ మో॥

చరణములు.

శేషశాయి పాదారవిందములు సేవింపగవలెరా - మూసినముత్యముచవలెనే మురియుచుండవలెరా - భక్తి తోడ తనభావములో - నిజభక్తుడుగానలెరా - శక్తిమా యలకుచిక్కక దృఢచిత్తుడుగావలెరా॥ మో॥ పిండాం

డంబును బ్రహ్మాండంబును పెనగిచూడవలెరా - పిండా డితారకమండలమందున తానునికిసేయవలెరా - నిండి యేకమై యుండినతనమది నీరుసేయవలెరా - పండువె న్నెలై ప్రభలెటితేజం - బయలుజూడవలెరా॥ మో॥ గాఢాంధంబున రేయుంబగలును - కలిసిచూడవలెరా- నాదైవాశ్రై యుండినఘన నిజవాసునెఱుగవలెరా - ఉ గ్రసుడై విషయేంద్రియంబుల డూరకుంచవలెరా - ని గ్రహింపనువిడిచి ఖేచరిముద్ర తెలియవలెరా॥మో॥ సి ద్ధలోకునభద్రమైనముద్ర దెలియవలెరా - చిద్రూపం బునగలిగెడిజీవుని సత్తుతెలియవలెరా - ఉశ్వాసనిశ్వా సంబులువిడిచే - ఊపము దెలియవలెరా - బుస్సునవిసరె అనుటగాలిలో-ఖేటివినగవలెరా॥ మోసపోకమూడాశలు॥

(౽౧.)-రాగము నాదనామక్రియ - చాపుతాళము.

పల్లవి.

సత్తుచిదానందయోగి॥

అనుపల్లవి.

చిత్తలతాబద్ధ చిన్మయయోగి॥ సత్తు॥

చరణములు.

చిత్తమనేపట్నమందుచిన్మయుడనేరాజు గాజ్యము చేయగాను-బుద్ధియనేమంత్రితోను-యిట్టి - పురుషార్థ మునుతలపోయవలెను॥ సు॥ భూతిపూసితేనేమి-యిట్లు- పూర్ధ్వపుండ్రముబెట్టినపురుషార్థమేమి-మూడుగుణం బులకామి-యిట్లు- మూర్ఖుడై తెనుమునిసిద్ధుడౌనా॥సు॥ ఒడలునీళ్లదడుపనేమి - యిట్లు - వ్రేడలునీళ్లదడిపినాపిరి

పెగబట్టినేమి - జడలుధరించి తెసేమి - యిట్టి - జడలుధరిం
చి తెజస్త్ర పావనము॥స॥ భూమిమీద మొక్క చెట్టు - అది -
పుట్టినప్పటినుండిభోగాలుపట్టు - కామక్రోధంబులనుబట్టు -
ఆది - కాంక్షింపభవరోగములుకాటుపట్టు॥ స॥ తొమ్మిది
తూటులబాన - అది - కన్నమాయలకల్లకానైనగూనా -
సమ్మరాపురగుపడాన - అది - నాశంబుజెందునునానావి
ధానా॥ స॥ సతిపతులిద్దరుగూడి ప్రేమపతిసేయుతల్లిశో
ణితములుగూడి - సుతుడాయెగర్భమునందే - దాన - సుఖ
ముచేసురదానివిడిచిచెట్టరా॥స॥ తొమ్మిదివాకిళ్లముగూడి -
తొంగలుండేచోటిల్లశోధించిచూచి - తుమ్మెదనాదము
వినుమ - తుర్యమైనముక్తిఫలితాన్నొల్వవలెరా॥ స॥ ఆప
గురునిబట్టవలెరా - పది - యూపగురునిబట్టిబంధించవ
లెరా - వేరొక్కటని తెలియవలెరా - తానునెళ్లనైనయూ
వోటతానిల్వవలెరా॥ స॥ తల్లిదండ్రులెందరున్న - యి
లు - తమ్ములుబావలుతగచుట్టుకొన్న - యెల్లబంధువులెం
దరున్న - తాను - తల్లిపాయ్యేవేళతనకెవ్వరన్న॥ సత్తు।

(౬౧.) - రాగము పున్నాగవరాళి - చాపుతాళము.

పల్లవి.

బయపేధానవసేయరా - బ్రహ్మానందం
బయవేబాయకయుండరా।

అనుపల్లవి.

బయపేధావనసేయ బ్రహ్మానందంబాయె
భయభక్తిసంసారపాపములేదమ్మ॥ బయవే।

చరణములు.

రెంటినిబిగబట్టిరాబిగియబట్టి మింటమనసుబెట్టరా- జంటరేకులనుధ్యసారముగనిపట్టి ఘంటనాదముచెవినం టకోరికయేలరా॥ బ॥ గుండుమీదికిజేరరా - మీదికిజే రి - ఖండభానునిమీరరరా- నిండుపున్నమనాడుపండువె న్నెలబైట - అండబాయకసచ్చిదానందమునుజెందరా॥ బ॥ సహజానందముజెందరా - ఆనందమొందిసరసిజాక్షు నిబొందరా - మహిమతోయేప్రొద్దు మాచిన్నిగోపాల విహితముతోడుతవెలయుతారకయోగిరా॥ బయలే॥

(౬౨.)—రాగము ధన్యాసి - ఆదితాళము.

పల్లవి.

గురువుపదేశంబాయెగదా - ఇక

అనుపల్లవి.

పురాకృతంబులులేవుగదా॥

చరణములు.

పరముతానని వరములొసగుచు - శిరమునసుతనక రమునుంచెను॥ గు॥ పరాకువలదని చరాచరమునొక - సరిగగనుమనిస్థిరముజేసెను॥ గు॥ అరిటనంటి - ఆరాట మణచియు - విరాట్టుదెల్పేస్వరాట్టుడగునన॥ గు॥ ధరను గుత్తికొండపురమునవెలసిన - సహలబ్రోచెనుముఠాని యగుద్రశ్రీ॥ గురుపదేశం॥

(౬౩.)—రాగము నాధనామక్రియ - చాపుతాళము.

పల్లవి.

చూడరాబ్రహ్మమునుజూపులోన -
వేడుకమీరినమేడలోన।

అనుపల్లవి.

కంటికిమింటికిరెంటికినడుమను -

ఘంటానాదముతుదనంటినీవు॥ చూ॥

చరణములు.

నాలుగువిధముల - మూలముదెలిసి - మూలిమితోడను ముమ్మూలకోనలో - కాటుకపక్షులగోటమీటుచును - మూటికిమీదను - సూటిగానునీవు॥ చూ॥ సృష్టిలోధీ సుడై - శిష్టలుసేయకాను - అష్టమదంబులను - యి ష్టముగను - భాగసతభక్తులైయోగ్యమైనట్టి - వైరా గ్యమునుజెందుపరభాగ్యమునునీవు॥ చూ॥ గురునిదెలి యరా సద్గురుని దెలియరా - గురునిదెలిసిమనసునందు పరముదెలియరా - నిరతముగురుసేవనిత్యమనినమ్మి - పరమపదవైభోగపద్ధతిగనినీవు॥ చూ॥ చూపరానిదొ క్క - పాపయున్నదిరా - ఆ - పాపదగ్గిర - చిన్నదీపము న్నదిరా - దీపములోదొడ్డరూపమున్నదిరా - ఆ - రూప మేగుఱుతుకు - ప్రాపైయున్నదిరా॥ చూడరా॥

పరశురామనరసింహదాసువారి కీర్తన.

(౬౪.)—రాగము మాయామాళవి - చాపుతాళము.

పల్లవి.

ఇదిగోర గురుకీలకం - జీవావినరా -

అనుపల్లవి.

అల్లదిగోరయోగసాధనము - ఇది॥

చరణములు.

ఇదిగోరశ్రీగురుపదద్వంద్వములునీహృదయములో

పాలవపలకఁదలచితే॥ ౩॥ కొండమీఁద పెద్దగుండుయున్న దిరా - ఆగుండులో సన్నంపుగంధియున్నదిరా - ఆగంధి లో నొకపండుపండియున్నదిరా - ఆ - పండనుభవించితే బ్రహ్మానంద బ్రహ్మమురా॥ ౪॥ ధాత్రిలోన నొక్కగాత్రమున్న దిరా - గాత్రమునకుచిన్మయనేత్రమున్నదిరా - నేత్ర ము మనసుపసూత్రముదెలిసి - పాత్రమెఱిగితేను బ్రహ్మా స్మియన్నరా॥ ౫॥ మూఁపులోన నీలరూపమున్నదిరా - రూ పములో నొక్కదీపమున్నదిరా - దీపములో నున్న తేజ స్సుగలసితే - పాపములణగితత్వమసియన్నరా॥ ౬॥ అ య్యైదెదులు యిరువైయైదయున్నదిరా - ఇదింటిమీఁ దను - ఆత్మయున్నదిరా - ఆత్మనుమథియించిఅమృత ము సేవించి - అనుభవమెఱిగితే - అయమాత్మాబ్రహ్మ మురా॥ ౭॥ గురువాక్యములు నాలుగు గుఱుతెఱుగవలె రా - గురుతెఱింగినంత నేపరము తానౌనా - పరశురా ము నివరనరసింహయోగికి - పరమపదము - బట్టబయలై యున్నదిరా॥ ఇదిగో గురుకీలకం॥

—(శివపురమువారి కీర్తనలు.)—

(౨౫.)—రాగము బేగడ - త్రిపుటతాళము.

పల్లవి।

నిండుపున్నమనాడు - పండువెన్నెలబైలు॥

అనుపల్లవి.

నిండియున్నదియేమిరా - సద్గురుదేవా॥

చరణములు.

రెండుమూఁడునుసునేత్రాముక్త్యమునుసజూడ - దండబాట

యుంచుకొనుచురా - సద్గురుదేవా॥ నిం॥ కోదమతుమ్మెదలై
మహారావలుచేయుచున్నవి - నదులకావలనుండురా-సద్గు
రుదేవా॥ నిం॥ మూపులోశివపురరూపు చూచినయపు
డే - దీపకాంతులుయేమిరా - సద్గురుదేవా॥ నిందు॥

(౬౬.)-రాగము మోహన - ఝంపతాళము.

పల్లవి.

పొందుగాసుసమాధిలో-బయ-లందిసుఖమునుజెందరా॥

అనుపల్లవి.

సుందరగాగురుబోధచేఆనందమునచెలువొందరా॥ పొం॥

చరణములు.

రెండుత్రోవలుమూసివాయువురేచకంబొనరించరా-
కుండలినిభేదించిసంతట - కుంభకంబొనరించరా॥ పొం॥
మూలాధారవజ్రకూటమధ్యము నూటిబెట్టిచూడరా -
నూటిగానవచ్చిటనీవు పగటిచుక్కనుగాంచరా॥ పొం॥
ఆరుచక్రములరసిసూక్ష్మద్వారమూర్ధముచేరరా - చేరు
వారుపదిమూర్తులము - తగ-పూరకంబొనరించరా॥ పొం॥
నీ మేలిమిగశివపురవిహారుని మూలమిదియని తెలియరా
నిలుత్రోయదమధ్యమందునిజమునీవై వెలయురా॥ పొం॥

—(ఆదికేశవులవారి కీర్తన.)—

(౬౭.)-రాగము కాంభోది - అటతాళము.

పల్లవి.

చేరెమనిల్లుకుఘామెన్నలతడిసెను తెలుసుకోరే॥

అనుపల్లవి.

తీపుపుగనములకుయును మంటపమామె తెలుసుకోరే॥

చ ర ణ ము లు.

చింతత్రమానిమీదచేమంతి పువ్వుపూచె తెలుసుకోరే-దానిచెంతనున్న కోతిపులిపిల్లనీనెను తెలుసుకోరే॥ చే॥ మూడుమూలలపెట్టెమూతతీసేనేర్పు నేర్చుకోరే-ఆమూతదీసితె పెద్ద భూతముకనుబడును తెలుసుకోరే॥ చే॥ అమ్ములపొదిలోనుకొమ్ముఏనుగుబుట్టె తెలుసుకోరే-ఆకొమ్ముఏనుగుమీదకుఱుచబాలుడుపుట్టె తెలుసుకోరే॥ చే॥ అమ్మమ్మయొకకప్ప అయిదుపాములమ్రింగె తెలుసుకోరే-దానియొడినిండనిప్పులువసంతమాడెను తెలుసుకోరే॥ చే॥ గుడిమీదనొకనక్క కూతల్లుబెట్టెను తెలుసుకోరే - దానిమెడనుండేఘంటలు మ్రోతలు మ్రోగెను తెలుసుకోరే॥ చే॥ తెలియనివారికియేడాదిగడువిస్తి తెలుసుకోరే - దీనిఅన్వయంబూదూరి - ఆదికేశవులెఱుగు తెలుసుకోరే॥ చేరెడు॥

—(వీరాస్వాములవారి కీర్తన.)—

(౭౮.)—రాగము యమునాకల్యాణి - రూపకతాళము.

ప ల్ల వి.

ఉన్నాడమ్మా చిన్మయప్రభువు - ఉన్నాడమ్మా॥

అ ను ప ల్ల వి.

ఉన్నాడునిజముగ నుపనుదెలిసిచూడ-కన్నచోటనె
ముక్తికాంతతోవెలుగుచునున్నాడమ్మా॥

చ ర ణ ము లు.

ఎనుబదినాలుగులక్ష జీవరాసులయందు నాటకధారుడైనటనేసల్పెడుప్రభువు॥ ఉ॥ శుద్ధసింహాసనమధ్యనుం

తర్లత్కృష్యముద్రద్విదళపద్మముమధ్యదివ్యమై వెలుగుచు॥
ఉ॥ చూపుహూపునంటిచూడగచూడగ వింత - చూపు
చూచెటిచోటచోద్యమై వెలుగుచు॥ ఉ॥ ఆరుచక్రములు
పైఆగ్నేయమందున్న - మేరుశిఖరమునందు తాండవ
కృష్ణుడు॥ ఉ॥ మూడుమూర్తులకాదిమూలమైన - వీ
రస్వామిచేయుపదేశమందినవారికి॥ ఉన్నాడప్పా॥

—(విజయకవివరుని అష్టకంబులభావము.)—

(౬౯.)—రాగము కల్యాణి - చాపుతాళము.

పల్లవి.

మొసలుమీసముగ తలలుక్రిందుగ
మొలచియున్నది వృక్షము॥

అనుపల్లవి.

మోదమలరగమింటిమీదనుమదగజమువిహరించెరా॥

చరణములు.

చిదిమిపట్టినబంటుపైకవడిచీమయేనుగుమ్రింగెరా-స
దయుడౌమళభూరిరాఘవసార్వభౌమదయానిధే॥ మొ॥
చింతబుట్టినరాతిమీదనుచింతమానుకటాయెరా - అం
తలోనెదానిలోను చేమంతిపువ్వులుపూచెరా - పంత
మూడుచుకప్పయొక్కటి పాముపైదరిటిమ్రింగెరా-వింత
గానిదినిజముమళభూరి వీరరాఘవదయానిధే॥ మొ॥ వి
ఱ్ఱవీగుచుకేకవేయుచు ఈగెమంచముమ్రింగెరా - గొ
డ్రెయొక్కటిమైదుపులులనుగొట్టినెత్తురుత్రాగెరా- చిట్టి
చెట్టునజాజిపువ్వులు శ్రీకరంబుగపూచెరా - మట్టిపైక
దళీఫలంబులుమళభూరిరామదయానిధే॥ మొ॥ కొంచె

పాదభేదములుఅణచియాత్మలో - శోధింపగవలెరా॥

చరణములు.

ఒక్కటిమొదలువృక్షములెక్కకుమిక్కిలికొమ్మలురా- ఎక్కిచూచితెమెంతోపొడుగాకాశమంటినదిరా - చొక్కమైనపండ్లొక్కకొమ్మనచేతికిచిక్కదురా - ఒప్పుగదెలిసినవారికిపండుయొద్దనెయున్నదిరా॥ ఊ॥ రెండుత్రోవలుకూడినచోట రేవుయొక్కటేరా - రెండురేకులపద్మములోపల అఖండతేజమునరా - ఉండజూచుకొనిఉనికితెలుకొనియెక్కబెట్టవలెరా - పండువెన్నెలనగాయేనుకొండలకెగువనురా॥ ఊ॥ మూడుయేకటిగాజేసేటందుకుమూలంబిదిగోరా - కూడకట్టసులంమయేటుకెసతాశోకటున్నదిరా-మూడురేవులుకూడినచోటముపితయున్నదిరా - వేదుకతోసరిపరిరమియించెమేడొకటున్నదిరా॥ ఊ॥ నాలుగుపవ్వులనాశ్యము తెలిసె నమ్మికయున్నదిరా - నాలుగాస్లోతనలోయిహపైవె నాలుగుయొక్కటేరా - మూలంబిదిగోసాంఖ్యతారక యమనస్కభావమురా - వాలాయముశోధించిచూడకవశముకాదుగదరా॥ ఊ॥ పంచభూతములు పంచవికారములు వదిలపరచవలెరా - ఉంచినమరితములారిటి మొదటికిత్రుంచివేయవలెరా - పంచాక్షరములుభావములోపలపఠియించగవలెరా - పొంచిమహాత్ముదాహాసేనుగురునిపాదముగనవలెరా॥ ఊమచు॥

రామబ్రహ్మమువారి కీర్తన.

(౭౧)—రాగం నాదనామక్రియ - అటతాళము.

పల్లవి.

కారణగురునెరుక తిరుగజన్మములేదు
గురుకరుణబడయవేచిలుకా॥

అనుపల్లవి.

గురుకరుణబడసితేయది మహామఘురమై
రమ్యమైయుండునేచిలుకా॥

చరణములు.

మనసాటివార్లెల్లనునమ్ముచూడగలేక మట్టిపాలైనారేచిలుకా – మనముఆటలుమానిమనము సద్గురువెదకి పరమాత్మదెలియవేచిలుకా॥ కా॥ కాలయముడుమనసుపారుగింటివాడనుచు కాలాకాలముదెలియు చిలుకా-కాలాకాలములదెలసి కళలనంటిన గురునికంటినమనుజూచుచిలుకా॥ కా॥ ఫాలలోచనుడంచులీను డైయున్నాడు నిజమనినమ్మవేచిలుకా-మూలకోనలోన మహాత్మాయియున్నది-అది తెలియవేనీవుచిలుకా॥ కా॥ రెంటనొక్క టిజేసిరేచించిహంసను దండిగాగురిగనవె చిలుకా - దండిగాసద్గురుడుకుండలిపై నున్నాడుపంచువెన్నెలనడుచిలుకా॥ కా॥ ఆలుబిడ్డలయనిభ్రామించియుండినయాగురుని దెలియకేచిలుకా- ఆలుబిడ్డలవిడిచియాకాశాతీతుని యచ్చోటచూడవే చిలుకా॥ కా॥ వదలకనుగురుసేవపదిలముగజేసితే - అదినీకుతెలియునేచిలుకా-అదినీకుతెలిసితెమదియాత్మగురిగని - ఆదివరునిగలయుచిలుకా॥ కా॥ గర్వపడకనునీవునిర్వాణపురమందునసర్వేశ్వరునిజూడుచిలుకా- మనసారబ్రహ్మముగురుమరమ్య

మైయున్నాడు - అతని దెలియ వేనీవు చిలుకా॥ కారణ॥

—(సున్నపుగుట్ట రాఘవులవారి కీర్తన.)—

(౭౨.)—రాగము - సావేరి - ఏకతాళము.

పల్లవి.

భ్రాంచేతు నే నెంతో జెప్పిన-
చెంచలముడుగవు ఛీత్త్వామనసా॥

అనుపల్లవి.

మంచిగురుని సేవించినా వికసందు తెలిసి భజియించవే ఛు త్తెరి॥ భ్రాంచేతు॥

చరణములు.

పొంచిపొంచి బహుమంచిగురుని గృహ - పంచ జేరవే భడవాధుత్తెరి॥ భ్రా॥ మంటిబొమ్మలాటంటను దెలియక - తంటలు జేసేవు తుంటవుధుత్తెరి॥ భ్రా॥ పట్టుగ సున్నపుగుట్ట రాఘవుల పట్టువిడువక వే ఛీఛీలుచ్చా॥ భ్రాంచేతు॥

—※ (వేంకట గురువులవారి కీర్తన) ※—

(౭౩.)—రాగము వసంతం - ఆదితాళము.

పల్లవి.

ఊరికిపోవలెరా పరబయలూరికిపోవలెరా॥

అనుపల్లవి.

ఊరికిపోవలెదారి తెలుసుకొని మేరుశిఖరమున వెలిగె టితావుకు॥ ఊరికి॥

చరణములు.

ఏడుకొండలెక్కి నడుమను మూడుయేర్లు దాటి - కూడిన నదులను వేడుకకనుగొని కూరిమితో నార్గురునివి

డిచి॥ ఊ॥ సన్నదిడ్డిదూరిపున్నమవెన్నెలబయలులలో - కన్నవారిని కనుగొనిపోవలె తిన్నగసన్నపుదారి తెలుసుకొని॥ ఊ॥ కంటిలోవెదకినను కానక మింటిలో వెదకినను- కంటికిమింటికి రెంటికినడుమను యొంటిగచీకటియింటిలోకనుగొని॥ ఊ॥ జోడుపాములుండుచూడగపడిగలెత్తియాడు- కోడెకాడుమణిమంత్రముగ్రోలుచు- నాడుచుకన్నులజాడలు గనుగొని॥ ఊ॥ పంచకోశములనుతనలోనెంచిచూడగాను - సంచితమిది శ్రీవేంకటగురుకృప తెలుసుకపోరా హంసనుగూడి॥ ఊరికిపోవలెరా॥

—※ (బాలకృష్ణ దాసునివారి కీర్తన.) ※—

(౭౪.)—రాగము - సౌగడ - చాపుతాళము.

పల్లవి.

ఎక్కడతిరిగినలేదురా జీవన్ముక్తి తనలోతత్త్వమందిచూడరా॥

అనుపల్లవి.

ఎక్కడతిరిగినలేదు తనలోతానుమనసుచెదరక - ధిక్కరించిచూపులోపల మక్కువతోమనసునిలుపక॥ఎ॥

చరణములు.

ఆరుమూడుయేడుతొమ్మిది - యెనిమిదిపన్నెండునాలుగుకమలమధ్యమందు -గురునిజేర్చికంటిబొమ్మనుకలసిచూడక॥ ఎ॥ పదియు యిరువైయైదు ముప్పైయారుతత్వజ్ఞానమందు - కనులమధ్యను గుఱుతుజేర్చి కంటిబొమ్మనుకలసిచూడక॥ ఎ॥ ఊరివాకిటకూతలాయె- వినగవినగవింతలాయె దాసుడేనివాసుడాయె బాలకృష్ణునిలీలలాయె॥ ఎక్కడతిరిగి॥

—* (శివయోగీంద్రులవారి కీర్తన.) *—

(౭౫.)—రాగము - సావేరి - అటతాళము.

పల్లవి.

కొలువై యున్నాడె సద్గురుమూర్తికొలువై యున్నాడె॥

అనుపల్లవి.

కొలువై యున్నాడుకోటిసూర్యులకాంతి
మేలైనభ్రూమధ్యమేడలోపలతాను॥కొలువై॥

చరణములు.

లలనరోవినవే- సద్గురుమూర్తి - అలివేణివినవే-ము
ల్లోకములకాదిముక్తి కారణమతడు-పల్లవపాణిరోయు
ల్లాములోనిపుడు॥కొ॥ఉన్నతముగను చిత్కళలలోచెన్ను
మీఱగను - మన్ననతోగురుమార్గము దెలిసితె - సన్ను
తాంగి నీలోస్వామిసద్గురుమూర్తి॥ కొ॥ మట్టుమీఱగను
కుండలియనెపెట్టెయలోను - గట్టుమీదనెపుడుఘనతేజ
లింగమై - కాంతిప్రకాశించుకలికిచిత్కళలతో॥ కొ॥ ఎ
ఱుకలోపలను మఱుపులేని యెఱుకతానగును - ఎఱుకె
పరశివుడని యెఱిగినశివయోగి భావములోనెపుడు బా
యకసద్గురుడు॥ కొలువై ॥

—* (తరిగొండ వెంగమ్మగారి కీర్తనలు.) *—

(౭౬.)—రాగము - నాదనామక్రియ - ఆదితాళము.

పల్లవి.

సద్వస్తువయుండేనన్ను నిలుపరాసద్గురునారాయణ దేవ॥

అనుపల్లవి.

అద్వయమై పరమామృతమై ఘననిరంజనమై వె
లుగుచునుండే॥ సద్వ॥

చ ర ణ ము లు,

ఇసుమైయైదిటిఁగూడి జనించిన యీస్థూలాంగము నేనెల్ల - సారవగుపదునే డింటినిఁగూడినసూక్ష్మశరీరము నేనెల్ల - గరిమయవిద్యాకరముగవెలిగే కారణతనువు నునేనెల్ల - సరవినిజాగ్రతస్వప్నసుషుప్తుల జాడలునెందుటనేనెల్ల॥ స॥ సారెకుజననమరణంబుల కిరవైనసంసారంబునునేనెల్ల - భూరిసుఖంబును దుఃఖంబునునొసగెడు పుణ్యాపాపములనేనెల్ల - జారిమఱల దిగబడుహేతువులగు స్వర్గనరకములనేనెల్ల - తీరనణుత్వంబున తెగనీయని దివ్యపదంబునునేనెల్ల॥ స॥ ఖరఖరమండలము ఖమండలముపై కలసిమెలంగుటనేనెల్ల -పరగమహాప్రళయనునుమూల ప్రకృతిని బొందుటనేనెల్ల - తిరిగిసుషుప్త్యాదులనుదయించేదీనదశలనునేనెల్ల -తరిగొండనృకేసరివేంకట గిరివరనిన్నికవిడువగనేనెల్ల॥ సద్వస్తువ॥

(౬౭.)—రాగము - కాఫి - చాపుతాళము.

ప ల్ల వి.

చెపుదంటెనేమి- నుంచిదియంటేనేమి - నీవు॥

అ ను ప ల్ల వి.

తడబడుచునునింత తపియించుటేమి॥ చెపు॥

చ ర ణ ము లు.

దేహముజూచినిందించితేనేమి-దేహినెవ్వడుజూచితిట్టెడీభువిని- సాహసకులకునీకుసంబంధమేమి-సాహాయ్యుడీస్వామి సర్వాంతర్యామి॥ చె॥ చిత్తమానిన్నుజూచిన వారున్నారా - చిత్తులక్షణము లక్షించికన్నారా-సత్తు

అసత్తులను విచారించినారా - ఉత్తమాటలకింతయురి కేదిమేరా॥ చె॥ దూషణంబులవిని దుఃఖించెవేలా-భూషణంబులగని పొంగేవేబేలా- ద్వేషులేహేతులని తెలియవేబాలా-రోషముద్రుంచిపోనుటమానుఅబలా॥చె॥ ఆశకన్నశత్రుడవనిలోలేడు - నాశత్రుడీయాశననువిడనియడు- క్లేశమెఱిగిదీనిగెలువంగలేడు- ఈశుడుదీనిశిక్షించకపోడు॥చె॥ ఉరగాద్రిపతియైనతరిగొండాధిపుడు-సరసధర్మాధర్మసాక్షియైనాడు - నరులను మాటలునైజములనడు-సారదిదబ్బరనిజముచూచుచున్నాడు॥ చెడు॥

(౭౮.)—రాగము - కాఫి - అటతాళము.

పల్లవి.

సోహం సోహం - హంసోహం సోహం॥

అనుపల్లవి.

సోహమనరాసతతం - హంసోహమనరాసతతం॥

చరణములు.

దూషణమేలరాభూషణులకును- నీమదిలోనే-రోషరోషపడకురాసతతం ॥సోహం॥ మానకషడ్వర్గములను ఖండించి - మాయలోమాయలోమాయగనరాసతతం॥ సోహం॥ పొందుగభ్రూమధ్యమందిరమందున-నాదులో నాదులో నాదుగనరాసతతం ॥సోహం॥ కలగనిమేల్కని లోనిదానించి - వెలుగులోవెలుగు లోవెలుగుగనరా సతతం ॥సోహం॥ అంబరవీధీనియాడుచుపాడుచుచూచుచు-నిరాలంబమునముక్తిముక్తినిగనరాసతతం॥సోహం॥ అరయుగశ్రీతరిగొండ నరహరిశంకరాచార్యుడే యాచార్యులనరాసతతం ॥సోహం॥

(౭౯.)—రాగము కాపి - చాపుతాళము.

పల్లవి.

శివుడంటే నేమి - కేశవుడంటె నేమి॥

అనుపల్లవి.

శివకేశవులచిత్తస్థితిభేదమేమి ॥ శివు ॥

చరణములు.

రతిరాజుభ్రమలచేరట్టయ్యెదేమి-మతిమంతుడై తెయీమతభేదమేమి॥శివు॥మంచువంటిది దేహమనియెంచలేరు-మించుబోణులగూడివిఱ్ఱవీగేరు॥శివు॥ మంచిదికానిదిమదినెంచలేరు-పంచేంద్రియంబులబడిపొర్లేరు॥శివు ॥ ఆమహాదేవుడే-అచ్యుతుడాయె- శ్రీమహావిష్ణువేశివరూపమాయె—ఈమహాతత్వార్థమిదినిత్యమాయె- ధాముడే నరసింహానాముడాయె ॥శివు॥ తమకముబోధాయెతాలిలేదాయె - తమగతిగానకతహతహలాయె - స్వామిశ్రీతరిగొండనరహరియాయె - సామాద్రివాసుడే శివశంభుడాయె ॥ శివుడంటె నేమి కేశవు ॥

(౮౦.)—రాగము ఆనందభైరవి - ఆటతాళము.

పల్లవి.

జ్యోతివెలుగుచున్నదమ్మా దానిలోతు తెలియరాదకొమ్మా

అనుపల్లవి.

పాతాళగగనకళాతీతమైసర్వ -

భూతములందుప్రఖ్యాతిగపరమాత్మ ॥జ్యో॥

చరణములు.

ఎవరిచేచిక్కదోయమ్మదానివిధమిట్టిదనిచెప్ప రాదు

గదమ్మా - శివకేళిలోఁగూడిసిద్ధేంపుభావమైపూని క్రమ మునచాలబుధులందుసయాత్మ ॥జ్యో॥ మాయలో మా యైసదమ్మ- దాని-మహిమదెలియకూడదమ్మ-మాయకు లోఁగానుమాయకువెలిగాను - రేయుబగలునొక్క రీతిగ పరమాత్మ ॥జ్యో॥ నానారూపములైనదమ్మా-తిరిగితా నుతానైయున్నదమ్మా- పూనిత్రికూటములోననిత్యా నందజ్ఞానములోని దానముగనాత్మ ॥జ్యోతి॥ కనక మ యమైయున్నదమ్మా-తిరిగి - కనవచ్చుకనరాదోయమ్మా- షక్తితోడగూడుక పగలురేయొకరీతి - తనువులోపలనీల తామరసమునందు ॥జ్యో॥ ఎఱుకలోమెఱుకైనదమ్మా- సర్వ-మెఱిగేసాక్షియైయున్నదమ్మ - పరిమాణువుగా వి శ్వపరిపూర్ణముగ నాత్మగురుచంద్రుడగు శ్రీతరిగొండ నరహరిరూపమున ॥జ్యోతివెలుగు॥

(౮౧)—రాగము ఆనందభైరవి - ఏకతాళము.

పల్లవి.

బ్రహ్మమేదోదెలుపరయ్యా బ్రాహ్మణులారా ॥

అనుపల్లవి.

పరబ్రహ్మమేదోదెలుపరయ్యా బ్రాహ్మణులారా ॥

చరణములు.

బ్రహ్మమేదోదెలుపరయ్యా భ్రాంతిలేకజీవునకు - క ర్మరహితమైనమోక్షగతికిపొయ్యేటందుకు ॥బ్రహ్మ॥ నిర్మ లాంతఃకరణులగుచునిత్యం - ఏకాక్షరంపరబ్రహ్మం-స త్యంబనిశ్రుతిమీరెఱిగినందుకు ॥బ్రహ్మ॥ బ్రహ్మకర్మము లనుజేసుకొనుచుగాయత్రిమంత్రముచదివి - బ్రహ్మసూ

త్రమందునిష్ఠ - బ్రహ్మాధిపతిబ్రాహ్మణోనుమ దేవతాయ
ను భావమెఱిగినందుకు ॥బ్రహ్మ॥ రేపుమాపుసంధ్య వా
ర్చి రేచించి - ఓంకారమందు - ఆపోజ్యోతి హంసోహ్మం
స్వాహేతియని మీరెఱిగినందుకు ॥బ్రహ్మ॥ యజ్ఞక్రతు
వులనుచు మీరుయోగముయాగముచేసి - భర్గోదేవ
స్యధీమహిసవితృర్భవతి భావంబెఱిగినందుకు॥బ్రహ్మ॥ప్రా
ణోపానవ్యానోదానసమానములనుగూర్చి-ప్రణవధ్యా
నులై వేదాంతంసోమపానంయజ్ఞం స్వర్గం-అనిమీరె
ఱిగినందుకు ॥బ్రహ్మ॥ ప్రొద్దెఱిగి ప్రొద్దునలేచిప్రొద్దుచె
ప్పెపంచాంగము-సుద్దులందు-ఓంనమోసిద్ధ ప్రజాపతిం
ధ్యాయేయనిమీరెఱిగినందుకు ॥బ్రహ్మ॥నిండువేడుకతో
తరిగొండభ్రమరాంబ-ఊర్ధ్వకుండలి ప్రణవమహాత్మ్యం
సుబ్రహ్మణ్యగురుడని మీరెఱిగినందుకు ॥బ్రహ్మ॥

(రా౨.)_రాగము నాదనామక్రియ - ఆటతాళం.

ప ల్లి వి.

జీవానీవునినుగానలేవా-నిన్ను ॥

అ ను ప ల వి.

భావించిచూచితేబ్రహ్మమేకావా॥ జీవా॥

చ ర ణ ము లు.

పరగదేహముమేడిపండు – లోన-తరచుగపురుగులు
తొలిచేటిపండు- తెరచాటుమాంసపుదిండు-దీని - తెర
గెల్లచక్కగా తెలిసితెబండు ॥జీవా॥ మునుకొనితొమ్మిది
తూట్లు-యీ-తనువుకారణమనితగనమ్మెదెట్లు-కనుగొను
దీనిలోగుట్లు-చాల-పనిబూనివిసబో తెబహుసిగ్గుబాట్లు॥

జీవా॥ బలురోగములకిది బాట-దీని-వలపుసొలుపులెల్ల వడిగండ్లమూట - నీవు-నిలిచితె తెలిసేవునీకిదెబాట ॥ జీవా॥ పరగదేహమువంటిపాలు - యీవికట - సంసారముడిడిచితేమేలు - సకలభోగములింకచాలు శ్రీ-అకలంకతరిగొండహరివై మమ్మేలు ॥జీవానీవు॥

(౬౩)—రాగము ఆనందభైరవి - ఆదితాళము.

పల్లవి.

శ్రీగురునియాడవేవో రాజహంసా ॥

అనుపల్లవి.

రాజయోగివై వెలుగుచుండవే వో రాజహంసా॥

చరణములు.

ఐదుపద్మములమీద రాజహంస-నీవు-ఆరోపద్మముచూడవేవో రాజహంస॥ శ్రీ॥ దండితేజమైయున్న దేవో రాజహంస-చూడ-రెండురేకులున్నా వేవో రాజహంస॥ శ్రీ॥ రెండురేకులనడుమ రాజహంస-చాల-నిండుగంగయమునలుండు రాజహంస॥ శ్రీ॥ నిండుగంగయమునలలోరాజహంస-చాల-చంద్రఖండకిరణాలుండు రాజహంస - చంద్రఖండకిరణాలలోరాజహంస - నడి - కుండలిరూపనున్నా దేవో రాజహంస॥ శ్రీ॥ కుండలితుదవెల్లేవేళరాజహంస-అల్ల-ఘోషవినవచ్చునే వో రాజహంస॥ శ్రీ॥ నాదబిందువులతోరాజహంస-కళ - భేదరహితమైయున్నా దేవో రాజహంస॥ శ్రీ॥ సచ్చిదానందభావము రాజహంస-నీవు-సత్యమని తెలియవేవో రాజహంస॥ శ్రీ॥ చిత్తనగత్వంపదము రాజహంస - అల్ల-సత్తనగతత్పదము రాజ

హంస॥ శ్రీ॥ ఆనంద మేలసిపదమురాజహంస-పూని-తా నుతా నైయున్నా దేవొ రాజహంస॥ శ్రీ॥ కానవచ్చేచో టనాదిరాజహంస-కను- కంటచూచి తెలియవేవొ రాజ హంస॥ శ్రీ॥చూపురూపుమొకటి జేసి- రాజహంస-అందు- చూడగబయలవు నేవొ రాజహంస॥ శ్రీ॥ దృక్కుదృశ్య ములు లేక రాజహంస- అందు- తెలివితుర్యమైయున్నా దే వొ రాజహంస - నిర్గుణజ్ఞప్తిమాత్ర మేరాజహంస- అం దు-నిర్మలపరిపూర్ణమవుదువు రాజహంస॥ శ్రీ॥ పిండాండ బ్రహ్మాండములురాజహంస - అందు- పెనగొనిలయమైపో నేవొ రాజహంస॥ శ్రీ॥సంశయమువిడువ వేవొ రాజహం స-పరమ - హంసభావము తెలియ వేవొ రాజహంస॥ శ్రీ॥ ఖండభావములిడువ వేవొ రాజహంస - శ్రీతరిగొండధా మునిగూడ వేవొ రాజహంస॥ శ్రీగురుని॥

## తరిగొండ-వెంగమ్మగారి కీర్తన.

(౮౪.)—రాగము శహానా - చాపుతాళము.

పల్లవి.

ఎందు కేనీకింత మోహాము-చిత్తమా - పరమా-

అనుపల్లవి.

నందమా - కైవల్యమా - యీ దేహాము॥

చరణములు.

పంచ వైయింద్రియవిషయ - బృందములనుదిరిగినీ వు-క్రిందుమీదు దెలియలేక-అందమా-చందమా - ఆ నందమా॥ ఎం॥ శ్రీధరునిపూజసేయవే-సాధులకనపరాధి వైసంగతిబ్రోవవే -సాధనసంపత్తిస దేహా-సాధన లేకిపొ

పంచ-బోధలోచేరితి వైనగాధలే-బాధలే-వాదాలే॥ఎం॥ దిక్కు దిక్కులానుచూడగ- పరమాత్మరూపమొక్కటై దీపించుచుండగ-చక్కగానీవుకానలేక - కుక్కవై-సంచరించేవు-తక్కువైనయీమాయలోచిక్కకే - సొక్కకే నిక్కకే॥ ఎం॥ కుండలీశైలాగ్రమందున - భాసిల్లుతరి-గొండలోనడివీధిసందున-చంద్రికిరణతార-చంద్రమండలమధ్యమందు-పండువెన్నెలలోనీవు నుండవే-పండవే-నిండవే॥ ఎందుకే॥

అంగప్ప గురువులవారి కీర్తన.

(౨౫)—రాగం కల్యాణి - అటతాళము.

పల్లవి.

కన్యప్రాయమైనచిన్నది - దాని -
కన్నవారికిమోక్షమున్నది॥

అనుపల్లవి.

సన్నపుదిడ్డిలో వెన్నెల బైటనుకిన్నరమీటుచునున్నది॥

చరణములు.

చంద్రబింబమువంటిచిన్నది-చేతి -కందరానిచోట నున్నది - అద్దములోపలపద్మాలనడుమను పొద్దుపొడిచేచోటనున్నది॥ క॥ ఏడుకొండలమీదిచిన్నది - పండువెన్నెలభావమైయున్నది-అకార-ఉకార-మకారశబ్దమై - ఓంకారమైయున్నది॥ క॥ కాటుకకన్నులచిన్నదిదానికలియుటబహుదుర్లభమున్నది - నాదునేడనకనునడివీధిలోపల నక్షత్రభావమైయున్నది॥ క॥ ఉన్నతమైనట్టిచిన్నది - ఉన్మణిభావమైయున్నది - ఒనరత్రికూటమునయొదిగిఅంగగురువుపదసూక్ష్మమైయున్నది॥ కన్య॥

## ⁕ చుండూరి-చెన్నదాసువారి కీర్తన. ⁕

(౭౬.)—రాగము హిందుస్తాన్ - ఆదితాళము.

పల్లవి.

అదేచరాచరమంతయుతానై-ఆడుచునుండేదదేగదా॥

అనుపల్లవి.

అట్టిదిట్టిదనిసర్వముసాక్షిగ - జూచుచునుండేదదేగదా॥

చరణములు.

కంటికిలోనైకంటికివెలుపై - అంటియుంటనిదదేగదా - కంటికిమింటికి రెంటికినడుమను - ఒంటిగవెలిగేదదేగదా॥ అ॥ నాలుగువీధులన్నడుమనునిలిచిన-నాటకసూత్రంబదేగదా - నాలుగువిధములనానారూపుల - నాటకసూత్రింబదేగదా॥అ॥ కుండలిలోపలనఖండరవంబున - నుండుప్రణవంబదేగదా - అండపిండబ్రహ్మాండములంతట - నిండినహరితేజంబదేగదా॥ అ॥ అరయగచింతలవేంకటగురువరు - డానతిచ్చినదదేగదా - ధరలో శ్రీచుండూరిచెన్నా - దాసునినేలిందదేగదా॥ అదేచ॥

## ⁕ చెంచురాజు గురువులవారి కీర్తన. ⁕

(౭౭.)—రాగము యెదుకులకాంభోజి - అటతాళము.

పల్లవి.

సుదతిరోసద్గురునిజూచినప్పుడే
కనులరూపముగనుపించునే

అనుపల్లవి.

ఆధారములుదాటి ఆనందరూపమై
అంటిపెనగుచుంటినే॥

చరణములు.

కంటిలోనున్న కారణమెఱుకాయనె - జంటనాగస్వరము నీవు-అంటివున్నాదుచుమింటిమీదను- ఒంటిస్తంభపుమేడలోపలవాలలాడుచునున్న చెలియ॥ సు॥ పరమేశ్వరునిభజనపలికినప్పుడే మదినిపాపములన్ని బాసునె - పరవశమైపరమానందముజెందవే - కోపతాపములన్నియునువాటిరూపములు లేకుండజేసి -దాపుననుండేటి-ఆపాజ్యోతినికనుగొనవె చెలియ॥ సు॥ మాధుర్యమనియెఘ్ముమతముజేరుకొని - హఠయోగములువిడువవే - ఘటములోనున్ననటనలన్నియుమానవే- దిటవుజేసుకమనసులోపలదివ్యలింగముఁనెప్పుడుచ్చూచుచు - కుటిలకుంతలిపైగనున్న కుండలినికనుగొనవె చెలియా॥ సు॥ ముయ్యేటికాలువముదురువెన్నెలబైట సదరుజేరుకయుండవే- మధురముగ్రోలిమాయనువిడజిమ్మవే - బాయకనుమదిలోననెప్పుడుప్రణవనాదముచెవులవినుచును- దాయమ్మనిపలుకుచుండెడుధన్యునికనుగొనవె చెలియ॥ సు॥ మూటిపైగనున్నముట్టుదెలుసుకొని - నూటిబెట్టుకచూడవే శుభగుణములందు - యేటికెదురునడవవే - కాటుకపక్షులనీవునూటిబెట్టుకమెట్టుమీదను - దీటుచాటునయున్న చెంచుధీరునికనుగొనవె చెలియా॥ సుదతిరో॥

※ శేషాచలాహ్వాయునికీర్తనలు. ※

(౮౮.)—రాగము ముఖారి - ఆదితాళము.

పల్లవి.

పామరజనులారామీరుభ్రమలువిడువండి॥

అ ను ప ల్ల వి.

చూచివత్తామురా రెసుదతులారమునము - శ్రీశుద్ధ సహస్రారమందుశయనించియున్నగురుని ॥చూచి॥

చ ర ణ ము లు.

పరమహంసుడటపరమాత్ముండట - ప్రణవస్వరూపుడటప్రణవమేపలుకట-బ్రహ్మంబతడటపరమగురుండట-పరమపదంబటపరులకందడట- వరదోగులకటవరములిచ్చునట॥ చూచి॥ ఆత్మారాముడటఅఖిలాత్ముండట-ఆనందుండటఅంతటనుండట- ఆదిమూలమటఅద్వయబ్రహ్మమట - అష్టాక్షరుడట అందరిసముడట- హరిహరాదులకటఅందనివాఁడట॥ చూచి॥ వేదాంతుండటవేదసారుడట - వేదవేద్యుడటవిశ్వేశ్వరుడట - విశ్వగర్భుడట- వేదాతీతుడటవేరుచేయడట - వేణునాధుడటవీనులకింపట॥ చూచి॥ నిర్వికల్పుడటనిరుపాధికుడట- నిగమవేద్యుడటనిర్మలుండట - నీరజాక్షుడటనిర్గుణుండట- నిటలమందెయటనాసికవీధియట ॥ చూచి॥ సూత్రధారియటసుందరాంగుడట - సర్వసముండటసర్వసాక్షియట - సర్వేశ్వరుడటసత్యసంధుడట - సర్వాత్ముండటసర్వముతానట- శేషాచలయోగినటస్థిరముగనేలినారట-చూ-

(౯౧.)—రాగము- ముఖారి - ఏకతాళము.

ప ల్ల వి.

హంసనుదెలియరా - మదిలోసంశయింపకురా॥

అ ను ప ల్ల వి.

హంసనుదెలిసితేనునీకుహింసలన్నిదొలగిపోను॥ హంస॥

చరణములు.

కుంభీపాకనరకమందుకూలిపోకురా - కుటిలబుద్ధుల బైవిడిచిగురుని జేరరా- గురుసేవయందు నీవుకుదురుగని లువరా-గుఱుతు దెలిసిసూటిబెట్టికుండలిదాటరా॥ హం॥ నిశ్చయింపుభక్తితోను నాసికమెక్కరా - నాదబ్రహ్మ ములోపలజొచ్చినాట్యములాడరా - నిర్గుణధ్యానము చేతనిజమును దెలియరా - నిటలమందునసాక్షినిజూచిని ష్ఠించరా॥హం॥ మూడారువాకిళ్ళయొక్క మూతను దె లియరా - ముమ్మూలకోనలోనుమురియుచునుండరా- ముత్యోటిజలములందుమజ్జనమాడరా - మనోలయం బయ్యేయోగము మక్కువదెలియరా॥ హం॥ పెదవులు బంధించినీవుప్రణవముపలుకరా - ఆధారాదిప్రాకారము లను అరసిచూడరా - మాతయైనమౌనభావముమనసు ననిలుపరా - నిత్యముగానివిహంగమార్గమువెతలువిడు వరా॥ హం॥ సారమైనవర్ణత్రయమునకుసాక్షినిదెలియ రా - నిరాకారధ్యానముచేతనిత్యముగనవలెరా- శేషా చలయోగిచెప్పినచిత్రము దెలియరా - శ్రీచెంచురాజు గురునివేడిస్వామినిజూడరా॥ హంసను॥

(౯౨.)—రాగము నాధనామక్రియ - ఆదితాళము.

పల్లవి.

వ్యర్థముకావద్దెచెలియావ్యసనముపడవద్దె।

అనుపల్లవి.

వ్యర్థమనర్థముయిహసుఖకర్తను-
శ్రద్ధతోడగురుసరణిదెలియకను॥ వ్య॥

చ ర ణ ము లు.

ధనముచేతక్రొవ్వినీవుజననములెత్తేవే - మానకగురుపాదములనుమనసుననిలుపవే॥వ్య॥ సొమ్ములయందాశవిడిచిసూటిబెట్టవే- చిత్రములైననాదములందుసొచ్చినిలువవే॥వ్య॥ మారుతమందుపలుకుగూర్చినోరుమూయవే-పరమాత్ముని భజనచేతపరముగందువే॥ వ్య॥ ప్రణవధ్యానముచేతనీవుబ్రహ్మామునొందేవే - భగవద్వాక్యమిట్టిదనుచుబాగుగదెలియవే॥ వ్య॥ గురుడుచెప్పినగుఱుతుదెలిసికన్నులుమూయవే - తుర్యముచేసినాసికమందు దృష్టినడుపవే॥ వ్య॥ హేయమనుచుసంసారమువెతలువిడువవేమాయబ్బొమ్మలాట యనుచుమమతలువిడువవే ॥వ్య ॥ చంద్రనాడియందుసూర్యునిసూటిగనడుపవే-సూర్యనాడితుర్యముచేసిసోమునినడుపవే ॥ వ్య॥ నిటలమందునవెలుగుచున్ననిజమునుదెలియవే - నడివీధియందుదిరుగుచునాట్యములాడవే॥ వ్య॥ శ్రీచెంచురాజగురుడువుండేసహస్రారమంటవే - శేషాచలయోగిచెప్పినచిత్రముదెలియవే॥ వ్యర్థ॥

(౯3.)—రాగము ఇంగ్లీషువర్ణమెట్టు - ఏకతాళము.

ప ల్ల వి.

యోగివరులనిందలుచేసితె యమునిజేరేరు

అ ను ప ల్ల వి.

ముక్కువతో గురుసన్నిధిజేరితే-మోక్షమునొందేరు॥

చ ర ణ ము లు.

నిందలుజేసెటిపందలజేరితెనరకములొందేరు-నాసి

కములోదృష్టినడిపితేనాథునిజూచేరు॥ యో॥ధనమదాంధులపొందుకలిగితెధర్మునిజేరేరు - తనువునందేతత్వము తెలిసితెదేవునిజూచేరు॥ యో॥ కాసులివ్వకఘనులనుదిట్టితెకాలునిజేరేరు - కుంభకమునెక్కిపోతేకుండలిదాటేరు॥ యో॥ అహంకారముచేపెద్దలదిట్టితె అంతకుజేరేరు - అజపకుండలిదెలిసితె పరమహంసు లయ్యేరు॥ యో॥మక్కువతోమూడాశలునమ్మితెమోసపొయ్యేరు- ముక్కుదిక్కుమెక్కుబెట్టితెమూలముదెలిసేరు॥ యో॥ ఇహమునందుసంపదనమ్మితెనిడుములుపొందేరు - ఎఱుకగలిగితే మదిలోరాజయోగము తెలిసేరు॥ యో॥ కామముచేపరకాంతలగోరితెకష్టములొందేరు - గుహలనడుమప్రకాశించురాజగురునిజూచేరు॥ యో॥ సత్యముగా నీలోకమునమ్మితెచిక్కులుపొందేరు - శేషాచలయోగిని నమ్మిన చిత్రముదెలిసేరు॥ యోగివరులనిందలుచేసితె॥

—※(జీవముక్తికాంతాసంవాదమైన ఏలపాట).※—

(౯౪.)—రాగము ధన్యాసి -చాపుతాళము.

పల్లవి.

కొండమీదిచిన్నదాన-కోటిసూర్యప్రభగలదాన॥

అనుపల్లవి.

కొండనెక్కేదారిజెప్పవే -

ఓచిన్నదానకోరినిన్నేచేరవచ్చెనే॥

చరణములు.

దారినేనుజూపబోను దగ్గిరకురానుబోను-దారిజూపవశముగాదురా - ఓచిన్నవాడా - దారిజూపేగురునిశే

రరా॥ కొం॥ శ్రీచెంచురాజగురునికృపనుస్థిరమైన దారి దెలిసి - శీఘ్రమునవచ్చిచేరుదు - ఓచిన్నదానా-చేరిసి గ్గుబారదోలేనే॥ కొం॥ కొండలోనుగుహలుండుగుహలు దాటిన కుండలియుండు - కుండలికిపైగానుంమరా-ఓ చిన్నవాడా - కోరిరానుతరముగాదురా॥ కొం॥ రేచక మునపూరకమునహంస పలుకు లోనగూడి - సొచ్చి కుండలి శీఘ్రమె దాటుము - ఓచిన్నదానా - జూచినీ వుచోద్యమం దేవే॥ కొం॥ చూపురూపుయొకటిజేసిచిన్నె వన్నెతళుకులుదాటి - చెంతజేరలేవుపోవ్రాయి - ఓచి న్నవాడా - సుందరాంగులతోగూడుము॥ కొం॥ సుంద రాంగియవగనీవే సొగసులాడియనగనీవే - చిన్నెలాడి యనగ నీవేను - ఓచిన్నదానా - చిత్రమైనశయ్యాదొ రికేను॥ కొం॥ అలవిగాదుశయ్యనెక్కహరిహరాదులకు నైన - అందరానిపండునేనేరా - ఓచిన్నవాడా - అం టవలవికాదుపోపోర॥ కొం॥ చూపురూపుయొకటిజేసి చిత్రతళుకులువేగమెదాటి - సోహమనేభావముచేతను- ఓచిన్నదానా - చిత్రగతులకూడిమెలగేనే॥ కొం॥యో గులకునలవియవుము భోగులకునలవిగాను - యోగనిష్ఠ దెలియుపోవ్రాయి-ఓచిన్నవాడా- ఎక్కువైనపదవిజెం దేవు॥ కొం॥ శేషాచలయోగినినేనేచిన్నెలాడి బ్రహ్మము నీవే - సొక్కియిద్దరమేకమైతేను - ఓచిన్నదానా - స త్యమైనబయలుచేరేము॥ కొండమీది॥

(౯౫.)—రాగము మాయామాళవి - అట తాళము.

పల్లవి.

సువ్వి సువ్వి యోగులార - సువ్వి సువ్వి భక్తులారా॥

అనుపల్లవి.

సువ్వి సువ్వి యనుచు మీరలు సూక్ష్మమందరే॥ సువ్వి॥

చరణములు.

శృంగాటకమను తావుజూచి యోగమనే రోకలెత్తి - రాగము నేవడ్లుబోసి బాగ దంచరే॥ సు॥ [illegible] ట్రిపూరకంబునముంచి యెత్తి - రేచకంబు [illegible] చెరిగి రాసి జేయరే॥ సు॥ పాపలందె బాటయందు ప్రణవమనుప లుకుగూర్చి - పగలు రేయి యేకరీతిగ బలుకుచుండరే॥ సు॥ సూటియనుఘటమునందు సోహమను బియ్యమునిచి సరసముగను గంగ యమున జలముల్బోంచరే॥ సు॥ కుండలి యనుపొయ్యిలోను కర్మములను సమిధలునిచి - మంట జేయ జంటతిత్తు లంటియూదరే॥ సు॥ మంటజేసి పచనమైన వంటకమును యారగించి - సూటిగాను సహస్రార మందు సొచ్చి నిలువరే॥ సు॥ సొచ్చి నిలచి మచ్చికలర శ్రీ చెంచురాజగురుని కరుణ - శేషాచల యోగినిగూడి చింత జేయరే॥ సువ్విసువ్వి యోగులార॥

౯౬.—రాగము భైరవి - ఏకతాళము.

పల్లవి.

గొబ్బియనుచు పాడరే కుండలీశయనునకును॥

అనుపల్లవి.

నిర్భరంపు భక్తితోను నిటలమందు సూటిజేర్చి॥ గొబ్బి॥

చరణములు,

నాదానుభవునకును నాగేంద్రశయనునకును-నార

దాదియోగిబృందమునమ్మియున్న బ్రహ్మమునకు॥గో॥ప్ర ణవాదినాదనులు భోరుకొని బ్రమోయగాను - మౌన యోగులందరును మారుతమునుగూడివేగ॥ గో॥ మట్టు గలిగిచట్టలోన దిట్టముగను దిరుగుచుండిన - గుట్టుదెలి సినాసికములో నీటుగానుసూటిజేర్చి॥ గో॥ ప్రణవమను చుమదినిదలచిపలుకుయందునునునిలిపి- పరమాత్ముని భజనచేయుచుబాగుమీరను॥ గో॥ కంటిపాపలంటబట్టి కొండలారువేగదాటి - మంటజేసిపాపములను ఒంటి స్తంభపుమేడనెక్కి॥ గో॥ సూర్యసోమవీధులందు శేషా చలయోగినేలిన - సారసాక్షుడైనశ్రీచెంచురాజగురువు నకును॥ గొబ్బియనుచు॥

(౯౭)—రాగము ఆనందభైరవి - చాపుతాళము.

పల్లవి.

హెచ్చరికగురురాజ యోగిజనహృదయ

అనుపల్లవి.

హెచ్చరికపరమాత్మ - యెఱుకసుగుణాత్మ॥ హెచ్చ॥

చరణములు.

అందరానిచోట ఆనందముగను-చందంబు దెలియు దురుసంతోషమునను-సందడిలేకుండసకలంబుమఱచి - ఉందుమవనిచూచెదరు పొందుబాయకను॥హె॥ కోటిసూ ర్యులకాంతిమేటిరత్నములు- సూటిగాచెక్కినళయ్యపై నీవు - నీటుగానుందువనినిటలమందునను - పాటపాడు చునుందురుబోటులందరును॥ హె॥ మునివరులందరును మురియుచుండగను - మౌనయోగులుగూడి మక్కువ

లరగను - మానసమందునధ్యానంబుతోను - వేణునాదమువినుచువిమలవీనులను॥ హె॥ సోహమనిపలికెదవుసొంపుతోడుతను - సకలజీవులయందు సత్యంబుగాను- శేషాచలయోగిని శ్రీకరంబుగను - స్థిరముగానేలితివిశ్రీ చెంచురాజగురుకృపను॥ హెచ్చరికగురురాజ॥

(౯౮.)—రాగము శహానా - ఏకతాళము.

పల్లవి.

లాలిముక్తులహంస లాలిపరమాత్మ॥

అనుపల్లవి.

లాలిముక్తికాంత - లాలిశ్రీకాంత॥ లాలి॥

చరణములు.

శ్రీగురుపాదములుచిత్తమునగోరి- సేవగావింపుడీస్థిర బుద్ధిమీఱి - సకలంబుమఱచియాసత్యమునుజేరి - సర్వ యోగులహృదయసాక్షికలుషారి॥ లా॥ ముగ్గురుమూర్తులుముందుగానిలిచి-బాగుగానూచెదరుపాలతిపూరించి- మక్కువతోరేచించెదరునుగువనీతొట్టె - పింగళయిడ నొలుసులనుప్రేమతోబట్టి॥ లా॥ సూర్యునరత్నాలమేడ లోపలను - నీటుగాపవళించినిదురబోవగను- పాటించి యోగులుప్రస్తుతించుచును - నటనములుచేసెదరునిట లమందునను॥ లా॥కమలాక్షిముఖముసోముని గేలిసేయ- కులుకుపలుకులుచిలుకపలుకులనుగెలియ - కుండలిపైనుండికులుకుచునుమెఱయ - కూడెదరుపవనమును సూటిగా గదియ॥ లా॥ ఆరుకొండలమీదనరుదుగానీవు - మెఱయుచుందువుమేటిపరములోపలను - పరబయలు

ద్వైతమనిభక్తితోదలచి- వరములుగోరెదరువాంఛతో డుతను॥ లా॥ శృంగాటకమునందుసొంపుతోడుతను-సో హమనిపలుకుచును సుస్థిరంబుగను-సర్వకాలములందు సాక్షిగానిలిచి - శేషాచలయోగికినిసేవగావించి॥ లాలి॥

—*(వకుళాభరణదాసుగారి కీర్తన.)*—

(౯౯.)—రాగము - సావేరి ఆదితాళము-

పల్లవి.

శ్రుణుగురువాక్యంచింతయతత్వదం॥

అనుపల్లవి.

చిన్మయపరబ్రహ్మానందబోధం॥ శ్రుణు॥

చరణములు.

త్యక్త్వామలమాత్రదేహం - భక్త్వాభజసద్గురుం నిర్మోహం॥ శ్రు॥ అజ్ఞానతమఃపటలాంశుమంతం-ప్రజ్ఞా నంబ్రహ్మామిత్యాజ్ఞాపయంతం॥శ్రు॥నిత్యానిత్యవిమర్శన శీలం - తత్వమసీతివాక్యానుకూలం॥ శ్రు॥ సహజామన స్కయోగవిలసితం - అహంబ్రహ్మాస్మీత్యనిశంవచంతం॥ శ్రు॥ మాయాజగ ద్భ్రాంతివిరహితం - అయమాత్మా బ్రహ్మామితివదంతం॥ శ్రు॥ వకుళాభరణస్తోత్రపాత్రం - పోకల - శేషాచలస్యపవిత్రం॥ శ్రుణు॥

—*(త్యాగరాయ భక్తుని కీర్తన.)*—

(౧౦౦ )—రాగము - వరాళి - ఆదితాళము.

పల్లవి.

నాదసుధినరా జీవా॥

అనుపల్లవి.

నీకిదెపరమునకుత్రోవ॥ నాదము॥

చరణములు.

నాదముదశవిధనాదంబులునై-మోదమలరగనుపాదుకయున్నది॥ నా॥ అష్టాక్షరినిదలచి-నీవష్టమదంబులనణచి - అష్టకమలమునానందింపుచు-అష్టపురంబుల-అంతుదెలుసుకొని॥ నా॥ సోహంబనినీవుదలచి - హంసోహంబనినీవుకలసి - సోహంబనితాచొక్కుచునిరతము-సోహబ్రహ్మముచోటుదెలుసుకొని॥ నా॥ ఇడాపింగళులగడచి - నడినాడిమధ్యముననిలచి - నాటకధారుని నయనమధ్యమున - సాడుచుపాడుచునానందింపుచు॥ నా॥ శేషాచలగురుదలచి-నీవు-శ్వేతలింగమునుదెలసి - శ్వేతలింగమునుసేవచేసినను - పాతకంబులునుబాసిపోవునిక॥ నా॥ బాగుమీఱగాను - భువిలోభక్తిసల్పుచును - భవభయంబులనుబారదోలెనని - బాగుగదెలిసిన త్యాగరాయుడని॥ నాద॥

—*దత్తాత్రేయులవారి మంగళం.*—

(౧౦౧.)—రాగము సురట - ఆదితాళము.

పల్లవి.

మంగళం - మంగళం॥

అనుపల్లవి.

సద్గురుదేవా - మంగళం - మంగళం॥

చరణములు.

నాదబిందాయె బిందునాదమాయె - బిందుబీజము సంసుభేదములాయె - బిందుబీజముసంసుభేదము దెలిసి

తె-సందేహములేదాయెసర్వముతానాయె॥మం॥సత్తుతా నాయె చిత్తుతానాయె - సత్తుచిత్తులురెండుసమరసమా యె - సత్తుచిత్తులరెంటి సమరసము తెలిసితె - వర్తిలేని జ్యోతివెలుగుతానాయె॥ మం॥ క్షరముతానాయెఅక్షర ముతానాయె - క్షరముఅక్షరములురెండుశాశ్వితమా యె-క్షరముఅక్షరములరెంటిశాశ్వితము తెలిసితె- అమ నస్కంబునునాయె-అంతతానాయె॥ మం॥ మాయకులో నాయెమాయకుమీదాయె - మాయ యిరువదియైదు మర్మములాయె - మాయయిరువదియైదుమర్మము దెలి సితె - మాయమాయమాయెపురియేమిలేదాయె॥మం॥ చూపుతానాయెరూపుతానాయె - చూపురూపులరెం టిప్రాపుతానాయె - చూపురూపులరెంటిప్రాపుతాదెలి సితె - పాపములేదాయెపరమపదమాయె॥ మం॥ నేను నీవాయె నీవునేనాయె - నీనామర్మములన్నినిజబోధలా యె-నీనామర్మములనిజముగాదెలిసితె - మానాభిమా నముమరినిల్వదాయె॥మం॥ అంగలింగమాయె లింగాం గమాయె-అంగలింగముసందు అనుభవమాయె-అంగ లింగముల రెంటి అనుభవము తెలిసితె - లింగరూపమా యెలీలతానాయె॥ మం॥ గురుడుశిష్యుడాయె శిష్యుడు గురుడాయె-గురువుశిష్యులసందు గుఱుతొక్కటాయె - హరియుదత్తాత్రేయగురుడని తెలిసితె - యెఱుకనిత్య మాయె యేమిలేదాయె॥ మంగళం॥

—※(పోకల - శేషాచలాహ్వయుని మంగళం.)※—

(౧౦౨.)—రాగము సురట - చాపుతాళము.

పల్లవి.

మంగళం-మంగళం-సద్గురుదేవా - మంగళం-మంగళం।

అనుపల్లవి.

మంగళం-మంగళం-సద్గురుదేవా - మంగళం-మంగళం॥

చరణములు,

నిర్గుణధ్యానులై నిశ్చయభక్తితో - నాడిహంసల వెంటసూటిగదిరుగుచు-నాటకుడున్నట్టికుండలిదెలిసిన-నారదాదియోగులునమ్మినదేవునకును॥ మం॥ ప్రణవాదినాదములుపిక్కటిల్లుచులేచి - వీనులయందునవింతగామ్రోయగ -మనసులియ్యేముచేసిమరిసద్దువినకను-మానసమందునధ్యానముచేయుచు॥ మం॥ సర్వాంతర్యామియై నిర్మలకారుడు-సహస్రారమందునసొంపుతోపవళించి-సర్వసాక్షియైసర్వముతానై - చలనములేనట్టి సర్వాత్మగురునకు॥ మం॥ శేషాచలయోగినిశ్శీకరంబుగనేలి-సర్వయోగులుమెచ్చ నిర్మలహృదయుడు-సాకారరూపమై నిగమాంతవేద్యుడై - సృష్టిలోవెలసిన శ్రీచెంచురాజగురువునకును॥ మంగళం॥

—※(నాసరు మహాత్మునుగారి మేలుకొలుపు.)※—

(౧౦౩.)—భూపాల రాగము - చాపుతాళము.

మేలుకొనుమీ - తత్పదంబున - మేలుకొనుమీ - త్వంపదంబున - మేలుకొనుమీ - అసిపదంబున - మేదినిలోవెలిని - ఆత్మా మేలుకొనవే॥ మేలుకొనకున్నావుయిహములో - మేలుకొనకున్నావుపరములో - మే

లుకొనకున్నావు - యీయిలకాలమధ్యములో॥ ఆత్మా మే॥ తోలునోటను తాలుమాటలు-తోసిపలుకుదురిం తెకాకిల - లేదుజననము లేదుమరణము - లేదునీకెపు డూ॥ఆత్మామే॥ లేదుజననము లేదుమరణము - లేదుమృ త్యువులేదుసర్వము - లేదులేదనిపలుకు ప్రణవము - ఆ దిగనుగొనను॥ ఆత్మామే॥మేలులోవెలిమేలు దెలిసియు- మేలులోవెలిమేలుగలసియు - మేలులోవెలిమేలునరసి యు - మేలుకొమ్మనవే॥ ఆత్మామే॥ వాదులాడుచువారు వీరని - భేదమున - యేమోదమెఱుగక - లేదుజననము- లేదుమరణములేదునీకెపుడూ॥ ఆత్మామే॥ దిట్టముగమే ల్కొల్పజాలక - యిట్టియాత్మనునెన్నమానస - దిట్టప దవని నిశ్చయించిన నీరసంబయ్యె॥ ఆత్మామే॥ చాలు పుష్పయుమేలుకొమ్మని - గాలమార్యులుమూలమెఱిగి న - ఫాలలోచను విష్ణుకమలము - బోలజాలుదురే॥ ఆ త్మామే॥ ఇట్టియాత్మకునిద్రమెళుకువ -పుట్టబోదనిగుట్టు దెలిపెన-గురుడుగాలబుకరుణానాసరుగట్టిమాటలను॥ ఆ॥

## బ్రహ్మముగారి మేలుకొలుపులు.

(౧౦౪.)—రాగము భూపాలం - చాపుతాళము.

మేలుకొనవే - తారకంబును- మేలుకొనవే - రాజ యోగము - మూలమినవే - శివునిగనవే-ముక్తిగెకొన వే॥ జీవా మేలుకొనవే॥ భూతపంచకమైనగృహమున - నూతగాగొనివిషయసుఖమున - ధాతయీశ్వరుడైతె గదనీవికనుమేల్కొనవే॥ జీ॥ మానసాదిగుణేంద్రియంబు

లు - మనసుతనియగసంచరింపుచు - పూని తైజసుడైతి
గదనీవిపుడుమేల్కొనవే॥ జీ॥ ప్రజ్ఞ లెల్లనుమాని నీనిజ
పాన్పుపైపవళించినాడవు - ప్రాజ్ఞుడైయానందభోగము
ప్రబలమేల్కొనవే॥ జీ॥ చూడనిరువైయైదుగురునిను-
చుట్టుకొనియున్నారుపనులకు - నేడుమేడలజాడగనినీ
విపుడుమేల్కొనవే॥ జీ॥ ఇట్టివారలుజంటలై - మూడిం
టిలోనడిమింటికొచ్చిరి - ఘంటకొట్టిరి వెలుగుగనియా-
రింటమేల్కొనవే॥జీ॥పాలపశ్చిమవీధివెంటనుతూర్పుగా-
పైదిడ్డిదెఱచుచుక - గాలినడిచేవిధముయున్నది - కనుచు
మేల్కొనవే॥ జీవా॥

(౧౦౫)—రాగం భూపాళం - చాపుతాళము.

పల్లవి.

హరిహరి - ఓజీవ- అనంతజన్మలెత్తివేసరితివి॥ మేలుకో॥

అనుపల్లవి.

హంసోహమనెగురునిపాదపద్మంబులు-
సేవింపగంటివి॥ మేలుకో॥

చరణములు.

శివుడని తెలియక జీవుండననుకొంటి - జన్మముసమ
సెను॥ మే॥ మూలాధారపరాశక్తి కుండలినడుమ - క
ళలుప్రకాశించె॥ మేలుకో॥ జీ॥ నాల్గుదళపద్మనడుమగ
ణపతితోను - వల్లభశక్తితానైయున్న శ్వాసమునా - ఆ
రునూర్లుగణపతికర్పితముగాజేసి - హంసోహమనెజీవా॥
మేలుకో॥ జీ॥ స్వాధిష్టమునబ్రహ్మసరస్వతితోగూడి - స
ర్వముతానైనశ్వాసమునా॥ ఆరువేలుబ్రహ్మకర్పితము

గాఁజేసి - హంసోహమనేజీవా - మేలుకో॥జీ॥ మణిపూరకమునవిష్ణు - లక్ష్మితోఁగూడుక-సర్వముఁ తానైనశ్వాసమునా - ఆరువేలువిష్ణుకర్పితముగాఁజేసి - హంసోహమనెజీవా - మేలుకో॥ జీ॥ హృదయపద్మంబున - శివుఁడు పార్వతితోఁగూడి - అంతతానైయున్నశ్వాసముఁనా - ఆరువేలుశివునికర్పితముగాఁజేసి - హంసోహమనేజీవామేలుకో॥జీ॥ కంఠపద్మంబున జీవుఁడు-మాయాశక్తినితాగూడి-అంతతానైయున్న శ్వాసమునా - అందొక్కవెయ్యి జీవికర్పితముగాఁజేసి - హంసోహమనె జీవామేలుకో॥ జీ॥ భ్రూయుగ్మమున పరమాత్మపరాశక్తితోఁతాగూడి - సర్వముతానైయున్నశ్వాసమునా - అందొక్కవెయ్యి పరమాత్మకర్పితముచేసి - హంసోహమనేజీవా మేలుకో॥ జీ॥ పతితపావనగంగయమునసరస్వతి - భ్రూయుగ్మమునస్నానమొనరజేసి - అగ్నిసూర్యచంద్రమండలంబులమధ్య - హంసోహమనె జీవామేలుకో॥ జీ॥ దశవిధనాదములు దశదిక్కులనునిండి చెలగిఝుంకారములు సేయగాను - నడుమప్రణవ ఘంటనాదముఘనమాయె-దేవుఁడవైవెలివిమెలుకో॥జీ॥ సహస్రదళపద్మమందు సద్గురుతోను - స్వశక్తితానైయున్నశ్వాసమునా-అందొక్కవెయ్యి గురునికర్పితముగాజేసి - హంసోహమనె జీవామేలుకో॥ జీ॥ హరిహరిశ్రీగురువు పాదములసేవ - ఆనందమాయెనుమేలుకో- అఖండమైనట్టి ఆనందవారాబ్ధి-వాలలాడుచుజీవామెలుకో॥ జీవా॥

శ్రీమద్వేదాంతసారుండును- సచ్చిదానందరహితుం డును - నాదబిందుకళాతీతుండును - ప్రకృతిద్వయదోషరహితుండును-అశరీరుండును - అచలపరిపూర్ణుండును - శ్రీ - అచలమార్గప్రతిష్ఠాపనాచార్యుండును నైన- శ్రీమద్రామమదుగు - శ్రీశివరామదీక్షితులవారు భక్తులకై కటాక్షించినతత్వవచనములు.

---

(౧౦౬.)—※(శ్రీశివరామదీక్షితులవారివచనములు.)※—

పదముజెందకముక్తిపదవిగలుగదు - మంచి-బుధులసేవలేకతత్వబోధ తెలియదు - నీతనూద్భవములు అతిసూక్ష్మములుక్షుదతృష్ణలనావెతల్లులేని గురుపదము - కులముగోత్రనామధేయగుఱుతులేకనెపుడు -విలయవృద్ధత్వములనువెలయబొందలేక - గుఱుతుగవర్ణావర్ణములనరయలేక -సర్వపరిపూర్ణమైయించుకబాధలేక - తరతరభావంబుతగులకకాలాంతరములేక - పరతత్వమైన గురుపదము॥ పట్టిమాటకట్టరానివట్టివుత్తబట్టబయలునై - యిట్టిదియనివచియింపరాక గనుబడనశక్యంబై నిండిన గురుపదము॥ నీమకర్మములనేనిష్టలేకనెపుడు - భూమ్యాదిపంచ భూతములపొలుపులేక - కామాదిశతృవర్గవికారిగాక-ధర్మార్థకామమోక్షములసత్కాంక్షలేక - భావికలనుబెంపారనికేవలాత్మారాముడైనశివ-రామదీక్షితునిగురుపదము జెందకముక్తిపదవిగలుగదు॥

※ అప్పగురుని కీర్తన. ※

(౧౦౭)—రాగము - నాదనామక్రియ చాపుతాళము.

పల్లవి.

అదిగోచూడండిగురుపద మిదిగోదెలియుండి॥

అనుపల్లవి.

అదిగోచూడం డదరకబెదరక - కదలక
మెదలక వదలకయున్నది॥ అది॥

చరణములు.

వట్టిమాటకాదుదానిపట్టుబోతెరాదు - దిట్టముగా దానిగుట్టుతెలిసితె బట్టబయలునై గట్టిగనున్నది॥ అ॥ మత్తులైనవారుదాని మర్మమ్మెఱుఁగలేరు - ఉత్తరిజగమనిచిత్తము నిలిపితైసత్తుచిత్తుగాకసమరసమైనది ॥ అ ॥ నలుపుయెఱుపుగాకధూసరి తెలుపు మెఱుపు లేక-మెలకువతోదానికీలు తెలిసితె- వెలుపలలోపలయేకమైయున్నది॥ అ॥ గొప్పకొంచెమనకకనుతెప్పపాటులోగా - అప్పగురునిమదినెప్పుడుతలచితె - తప్పకయెందునుయొప్పుగనున్నది॥ అదిగో॥

## రామకృష్ణయ్యగారి కీర్తన.

(౧౦౮.)—రాగము ఆనందభైరవి - అటతాళము.

పల్లవి.

వెయ్యరా - భేరి వెయ్యరా - గురుమండలీలో-
కొట్టరా-ఢంకాకొట్టరా॥

అనుపల్లవి.

అయ్యగారిభావమందిన-అచలులకుజన్మంబులేదని॥ వె॥

చరణములు.

పంచభూతములతోను సహితమైనయేఱుకవిడువని-మించినభావంబులెల్లవంచనలుకూడవనుచు॥ వె॥ లేఁత తోఁచుదేహములలో-లోతుయేమో తెలియదిలను - పాతకులు అయినవారలు ఖ్యాతిగాచెడిపోదురనుచు॥ వె॥ ముదుపుయెప్పుడుసత్యమనుచు వదురుచుందురుసకలజనులు - బదులుయేమోతోఁచనట్టిభాగ్యహీనులకందరాదని॥ వె॥ ఇలను తెలియకసకలజనులు కల్వరింతుపుగాని భువిలో - సలలితనిజబోధవారికి సర్వకాలము పొందదనుచు॥వె॥ లోకులమాటలుయెపుడు కాకులకూతలుయని - లోకమందునయేఱుకవిడువని లోలులకునర్థంబుగాదని॥ వె॥ మూడుమేనులునమ్మియున్న గూఢమైనాయేఱుకవిడువని - గాఢనిష్ఠనునమ్మియున్న ఖరములకు దెలియంగరాదని॥ వె॥ రజ్జుసర్పవతుగనుండే ముజ్జగంబులువిడుచురీతిని - సజ్జనులనాశ్రయించినదుర్జనత్వము విడిచిపోనని॥ వె॥వంధ్యపుత్రవతుగనుండే సంధియేమో తెలియదిలను-బంధనములచేతదగిలేవారికీభావంబులేదని॥ వె॥ శివరామదీక్షితులసవరణభావంబుగనని- కావరంపుజనులకెల్లనుసావధానతగలుగదనుచు॥ వె॥ సూటిదగిలిరాజపేటబాటదెలిసిపోవనేరని - బూటకులకునిదియుగాదని బుధులచేతనుజెప్పబడునని॥వె॥ వాసిగావల్లూరిలోనుభాసురంబుగ మెలగుచుండిన - భూసురునిభావమెప్పుడు వసుధలో జెప్పంగబడునని॥ వె॥ రామకృష్ణయరచనజేసిన రహస్యవచనములోనియర్థము - భూమిమీదనుసంచరించె బుద్ధిహీనులకందరాదని॥ వెయ్యరా॥

—*(సుబ్బరాజుకవిగారి కీర్తనలు.)*—

(౧౦౯.)—రాగము నాధనామక్రియ - ఆదితాళము.

పల్లవి.

ఏదిరాజననమరణము - నిజబోధగనిన॥

అనుపల్లవి.

లేదురామోక్షనరకము॥ ఏది॥

చరణము ౧౨.

ఏదిరాజననమరణములేదురాపరిపూర్ణమందున- వేదశాస్త్రాభ్యాసులను - మతవాదులను విడనాడెవారికి॥ ఏ॥ తానువచ్చిన చోటుదెలియదు - తనతోటిసర్వము తల్లిపొయ్యేబాటదెలియదు - లేనిపోనిస్వప్నమందున ఏనుగులుగుఱ్ఱాలురథములు- సేనలుసేనాధిపతులుయోనిసంభవమైనతనువులు॥ ఏ॥ రాజులేదుమంత్రిలేదురా - రాజొక్కడుంటే - గాజుకడియముయెందుకౌనురా - రాజులేని కయ్యమాయెను రాజ్యకాంక్షలు దబ్బరాయెను-వాజిపేయులు సోమయాజులు వాంఛకలలోవార్తలాయెను॥ ఏ॥ దిక్కులేనిదౌరతనము - దిక్కునేదంటే- నిక్కముయీజగములౌనురా-దిక్కులేనితనువుయిలపైపెక్కుశాస్త్రములగాధ-ఒక్కఱెప్పపాటులోపల బొక్కపెట్టునిక్కుజీవుల॥ ఏ॥ ఎన్నటికినమ్మరానిది - క్షణభంగురమిది-యెన్నిపేర్లుపెట్టుకొన్నది - తన్నుదానుగన్నమోక్షంబన్నమాటలునున్నలాయెను- ఉన్నదేపరిపూర్ణమెందునునిన్ననేతెరదీసినప్పుడే॥ ఏ॥ తల్లియీలింగాంగమందురు - తర్వాతదాని - పిల్లలుస్థూలాంగమందురు - త

ల్లిస్వప్నముపిల్లజాగ్రత తల్లిదారిపిల్లకాయెను - యెల్ల
వారిబ్రతుకుభాగ్యము లెల్లజూడను తెల్లనాయెను॥ ఏ॥
వింతవింతలుతోలుబొమ్మలు - పరిపూర్ణజలధిలో - ము
తలుయీకీలుబొమ్మలు - భ్రాంతిరహితమైనగురునిచెంత
జేరిషోడశాకురి - సంతతముద్వాదశాకురి చింతనజేసెడు
వారికి॥ ఏ॥ నీవుబయలులోపలుంటివి - నీయందుబయ
లు - నిండియున్నదెటులగ్గవైతివి- నీవుబయలుసూచనై
తేనిమిషమాత్రమునిలువలేవు - కేవలమునీకావలీవల
స్థావరముపరిపూర్ణమాయెను॥ ఏ॥ సందియముతీరెనేటి
కి - మాయిందుకూరి - యిందుధరునిశిష్యకోటికి-యొం
దరులేదన్నబయలుయెందుజూచినసందు లేకను - అందరి
లోసుబ్బకవిరాజనుభవార్థమునిచటదెల్పెను॥ ఏది॥

(౧౧౦)—రాగము ధన్యాసి - ఆదితాళము.

పల్లవి.

*ఇంతకుమిక్కిలిలేదనిగుసువరు-డిచ్చినద్వాదశియదేకదా

అనుపల్లవి.

కొంతైనాతనమూలములేని - వింతలషోడశియిదేకదా॥

చరణములు.

పంతములాడదు - గంతులువేయదు - అంతులుసే
యనిదదేకదా - కాంతలపురుషుల - కయ్యాటములకు-
కారణమైనదియిదేకదా॥ ఇం॥ ౧॥ ఖేదమోదములు- భే
దవాదములుకాదౌననిదియదేకదా - వేదశాస్త్రముల
వాదముచేసె - సాధుపలవదియిదేకదా॥ ఇం॥ ౨॥ సత్య
ముసత్యముసత్యంబనుచును - నిత్యంబైనదియదేకదా-

ఇత్యేకాక్షరమిది(బహ్మంబని - కృత్యముచేసేదిదేకదా॥ ఇం॥౩॥ ధాత(వ్రాతలకుచేతులకందదు - హేతురహిత మౌనదేకదా - నాతిమధ్యమునజ్యోతియున్నదనికూతలుకూసేదిదేకదా॥ ఇం॥౪॥ అతులితముగనేమతములకును - సమ్మతమైయున్నదదేకదా - ఈతకుమిక్కిలిలోతులేదని - జ్యోతులు(భమింగేదిదేకదా॥ ఇం॥౫॥ సంగరహితనిస్సంగమనంగను - పొంగని(కుంగనిదదేకదా - అంగములోపలలింగభంగమని- లింగము(భమింగేదిదేకదా॥ ఇం॥౬॥ కుంఠితములులేకున్నసుతన - వైకుంఠంబనగానదేకదా - కుంఠితములకునుశుంఠయున్నది - తేంటలమారిదిదేకదా॥ ఇం॥౭॥ (గాసవాసవిలాసరహిత - కైలాసంబనగానదేకదా-దాసదాసులనుకాశికిఁబంపే-యాశలపుట్టిల్లిదేకదా॥ ఇం॥ ౮॥ రాజమార్గమురెయిల్బండిమేల్ - రస్తావంటిదియదేకదా-మజాకుదినికుజాకులీడ్చే-భజీతు(త్రోవలదిదేకదా॥ఇం॥౯॥ ఎంతనిచెప్పుదుకలలోముచ్చట - భ్రాంతిరహితమైనదదేకదా - పొంతనగాకనుసాంబయగురుని - చెంతనుజేరినిదిదేకదా॥ ఇం॥౧౦॥ నిబ్బరముగయీసుబ్బరాజుకవి-కబ్బినభాగ్యంబదేకదా - కబ్బములేవేయికోటులుచదివిన - దబ్బరపాటులదిదేకదా॥ ఇంతకుమిక్కిలిలేదని॥ ౧౧॥

—*(కాలువ కోటప్పగారి యచల కీర్తనలు.)*—

(౧౧౧.)—రాగము తోడి - చాపుతాళము.

పల్లవి.

నమ్మిశిష్యులగాంచుమని శివరామదీక్షితులన్నది

కమ్ముకొని బ్రంహ్మాండమంతయుకదలక గుపడుచున్నది॥న॥

చరణములు.

చలికియెండకువానకెప్పుడు-అలసటేమియులేనిది- పలుకుభావంబంటదదిగో పరబ్రహ్మమురూపది॥న॥ఆదిమధ్యాంతములు లేని యచలమైతానున్నది-సూదిమోపనుసందులేకను చూడశక్యముగానిది॥ న॥ పరమపదకైలాసభావముగురువరేణ్యులకెఱుకది – ధరణిలోపలమూఢమతులకుఁదలఁచనలవియుగానిది॥ న॥ పుట్టుగిట్టులుబారయెకెప్పుడుబట్ట బయలైయున్నది – గుట్టుదెలియకనరులుయముని పట్టుబడిచనిపోయెద్రి॥ న॥ పంచభూతములెఱుకగూడి ప్రపంచరూపకమైనది - గాంచనేరకదుర్జనావళి ఘనమునీచములెన్నెది॥ న॥ జడలుదాల్చిజపితులైననుపుడమినదిగనరానిది- ఘడియలోగనవచ్చుగురునికభిముఖంబైయున్నది॥ న॥ కులమునాచారంబులెన్నినకుటిలులనుఖండించెది - చలనయచలపుసంధితెలిసినజగద్గురువులమహిమది॥ న॥ కలయుమేల్కనిగాంచియణగినక్రమముగానెగుఱుతది - ఎఱుకజేసినవేదశాస్త్రిములెఱుకకేవినసొంపవి॥ న॥ఎఱుకచూచి యెఱుకబాసియెఱుకెచనిపోచున్నది- ఎఱుకబాసినబ్రహ్మవేత్తలుయెఱుగనికనేమున్నది॥ న॥ నామరూపక్రియలులేకనునరులకదిగనరానిది – స్వామిగాలబుగారి కృపను భక్తులపరమైనది॥న॥ సాధనేమియులేకసద్గురుబోధరూపకమైనది- గాథలన్నియుమీడజేసిన గాలబుగురుకరుణది॥ న॥ ఎఱుక

జగములున్నవనిబయలెన్నఁడెఱుఁగకయున్నది- మీఱక
సద్గురునాజ్ఞశిష్యులకోరియుపదేశించెది॥ స॥ దారిదప్పి
నూతగూలినధనికునిచందంబది - అరుగుకరుగు పరుగు
వరుగుమొరుగుతరుగులులేనిది॥ న॥ హరిహరబ్రహ్మాది
యోగులుపరమపదమనదగినది - గురుకీలుదెలిపినభాగ
వతులకృష్ణదాసునికవితది॥ న॥ చెప్పెద్వాదశిగురుడుగా
లబుజేరియూరికెయున్నది - తప్పెషోడశికాల్వకోటప్ప
బయలైయున్నది॥ సమ్మిశిష్యుల॥

(౧౧౨.)—రాగము మోహన - చాపుతాళము.

పల్లవి.

రాదుపోదుశివనామదీక్షితులు-
బోధపరచినయచలమిది.

అనుపల్లవి.

బాధలేదుయీబోధవినియుగురు-
సాధకులైతేదెలియునది॥ రాదు॥

చరణములు.

ఉన్నదిబయలనియెన్నినయెఱుకను - సున్ననిసుజను
లుఁజూతురది - తిన్నగవెలిగేతెఱపుమఱపులే - కున్న
బయలుతామందినది॥ రా॥ చెప్పవలయుగురుసేవజేసిగు
రు-మెప్పునదిరిగేవారికది - తప్పదోవలనడిచేవారికి-చె
ప్పరాదుగురుమర్మమది॥ రా॥ కరుగదుపెరుగదుఅరుగ
దు-అంతటనిండియున్నది-హరిహరాదులకునసాధ్యమై
గురు - కరుణైతేబహుసులభమది॥ రా॥ పుట్టదుగిట్టదు
పుడమిలోజనులకు - బట్టబయలైగనుపించునది-యీ-

గుట్టుదెలిసినగురుశిష్యులకు - పట్టిచెప్పపరిపూర్ణమది॥ రా॥ యెఱుకశరీరంబేమిలేదనియెఱుకేచెప్పితెసరైనది- యీ- తెరవుగానకను పరిపరివిధముల-పరుగులుబారేర దేమది॥ రా॥ కీలుదెలిసినశ్రీకృష్ణమూర్తిచే - మేలుగ రుక్మిణిదెలిసినది - గాలబుగుసువసుకరుణనేలిన- కాలవ కోటుప్పదైనది॥ రాదు॥

—※పోకల-శేషాచలాహ్వయుని అచలకీర్తనలు.※—

(౧౧౩.)—రాగము - నాట ఏకతాళము.

పల్లవి.

—వందనంబాచరించెద సందియంబులెల్లవీడి - సదా॥

అనుపల్లవి.

మందహాససుందరపూర్ణేందువదనగురునికిపుడు॥ వంద॥

చరణములు.

నాదబిందుకళాతీత - ద్వాదశాక్షరీభావము-మోద మలరసాదరమునబోధచేసినసాధునకును॥ వం॥ మిథ్యాజ గద్భ్రాంతిభ్రూమధ్యగతాపోజ్యోతి - తథ్యమనుచుదె లియజేసినబోధగురుస్వాములకును॥ వం॥ దారుపురుషరీ తిగాను అరయ షోడశాక్షరనుచు - కరమనురక్తిదెలి పినవరగుణామణికి నేడు॥ వం॥ శశివిషాణములభంగినశ్వ రంబాయెఱుకయనుచు-అశేషపరిపూర్ణమిచ్చిన - శేషా చలునిగురునికిపుడు॥ వందనం॥

(౧౧౪.)—రాగము - ధన్యాశి - ఆదితాళము.

పల్లవి.

భ్రాంతినిరసనంబయ్యెడి
భావాభావాతీతముగనరయ్యా

అనుపల్లవి.

శాంతస్వాంతులగుచునుమీరు
విశ్రాంతిమార్గమిదివినరయ్యా॥ భ్రాంతి॥

చరణములు.

అతులితశుద్ధస్ఫటికసంకాశాఆహో-జ్యోతియేయెఱుకనిదెలియరయ్యా -అతిధీరతతోనాయెఱుకనుగడచిన-గతియేసద్గతిగనరయ్యా॥ భ్రా॥ మృగతృష్ణాంబుగ్రహణసామర్థ్యము - అగణితసాహసగుణవంతులకుసుగలదా - తగనారీతిగభ్రమమూలంబగు-జగద్వర్తనంబనియెఱుగరయ్యా॥ భ్రాం॥ క్షరాక్షరంబులమీఱినట్టియాపరవస్తుసాంగత్యముగొనరయ్యా - హరిహరహిరణ్యగర్భప్రముఖుల - పరమనిక్షేపమే పరిపూర్ణమయ్యా॥ భ్రా॥ కలశజలస్థచంద్రప్రతిఫలవత్-అలరుచున్నదీకూటస్థయెఱుక - పలుదెఱంగులనుభ్రమలువలదికను-చలనరహితాశేషాచలముగనరయ్యా॥ భ్రాంతి॥

(౧౧౫.)—రాగము - నాదనామక్రియ - ఆడతాళము.

పల్లవి.

ఏమియుగానిదిది-ఇదియేమోగాని

అనుపల్లవి.

ఏమనరానిదిది॥ ఏమియు॥

చరణములు.

నాదబిందులుగాకనామరూపములేక- వాదభేదము

లేకపాదుకయున్నది॥ ఏ॥ ఎఱుకమఱుపులులేకయెగువది
గువలుకాక-ఏమియుననరాకయేకమైయున్నది॥ ఏ॥ ప్ర
కృతిద్వయములేకబీజజడములుగాక - కనులపండువుగా
నుగనుపించుచున్నది॥ ఏ॥ ఆనందమునుగాకఆదితుదలు
లేక-అఖండరూపమైఅంతటనున్నది॥ ఏ॥ సత్తుచిత్తులు
గాకసాక్షిత్వమునులేక - చలనమించుకలేక స్థిరముగను
న్నది॥ ఏ॥ పలుకన్నబలుకకతలపన్నదెఱుగక-చలికియు
లికిపడకనిలచితానున్నది॥ ఏ॥ కాలాకాలములులేకకా
రణమునుగాక - కదలకమెదలకకళాతీతమైనది॥ ఏ॥ భ
క్తియోగముగాకశక్తిజ్ఞానముగాక - పరమభాగవతుల
కుపరిపూర్ణమైనది॥ ఏ॥ సద్గురుకరుణచే శేషాచలాహ్వ
యుఁడు-సొంపుతోదెలిసినస్వామియచలబ్రహ్మ ॥మేమి॥

(౧౧౬.)—రాగము-పున్నాగవరాళి-చాపుతాళము.

పల్లవి.

ఎంతోవింతగనున్నదమ్మ - సద్గురునిపదము॥

అనుపల్లవి.

ఎంతోవింతగనున్నదమ్మ॥ సద్గురుని॥

చరణములు.

ఎంతోవింతగనున్నదియెందునుతానేకమై-సందియం
బులేకయెప్పుడుసాక్షిరూపముగానిగురుపదము॥ ఎం॥
శివుడువిష్ణువుగాకసృష్టికర్తయుగాక-సత్తుచిత్తులుగానిస
త్యమైనగురుపదము॥ ఎం॥ నామరూపములేకనారాయ
ణుడుగాక—నాదబిందుకళాతీతమైనగురుపదము॥ఎం॥ఆది
శక్తియుగాకఆధారమునులేక - ఆపోజ్యోతియుగానిఅ

ఖండగురుపదము॥ ఎం॥ అట్టిదిట్టిదనగాకఆత్మానాత్మ లుగాక - ప్రకృతిద్వయములేక భాసిల్లుగురుపదము॥ ఎం॥అచలగురునికరుణచే శేషాచలాహ్వయుఁడు - ప్రపంచభ్రాంతులులేనిపరిపూర్ణగురుపదము॥ ఎంతో॥

(౧౧౪.)-రాగము మధ్యమావతి - చాపుతాళము.

పల్లవి.

వినరాసదానందయోగి - నీవు॥

అనుపల్లవి.

వినస్వైరువనివిశదపఱుతువైరాగి-వినరా॥

చరణములు.

మూఁడుయేరులుకూడినచోట-దాని- మూలమెఱుగకనీవుమురియుచునున్నావు॥వి॥సచ్చిదానందముసమసిపోయినవెనుక - సాక్షిత్వమనుమాటసరణిగనరాదు॥ విన॥ శివజీవులునుమాయసృష్టికర్తయుమాయ- కేవలాత్మనుగన్న విశ్వమంతయుమాయ॥ వి॥ లోకాలోకములుమాయలోకకర్తలుమాయ - ఏకమైగురుపదముబట్టియలాయ॥ వి॥ ఎఱుకయేకాలమునిలచియుండగలేదు- మఱుపుతెలుపులులేని మర్మముగనరా॥వి॥సాధనపరులకుసాధ్యముగాకుండు - బోధరూపకమైనపరిపూర్ణభావము॥ వి॥ చలనమించుకలేక శేషాచలాహ్వయుఁడు- కీలుదెలిపినట్టియచలభావమునేడు॥ వినరా॥

(౧౧౫.)-రాగము - మధ్యమావతి - ఆదితాళము.

పల్లవి.

పట్టుగానుగురునిపాదముపట్టినిలువరా॥

అనుపల్లవి.

బట్టబయలైనపరమపదముగుట్టు తెలియరా॥పట్టు॥

చరణములు.

మఱుపు తెఱుపులుగల్గించుమెఱుకనువేగవిడిచి-పరమపదరాజ్యంబునకుప్రభువై యుండరా॥ప॥ దృక్కు-దృశ్యములనుబొందెడుద్రష్టయైనసర్వసాక్షి - నిక్కముగా లేనిదనుచునిజము తెలియరా॥ ప॥ సాకారనిరాకారములుసమసిపోయినవెనుక-యేకరీతిగానుబట్టబయలునిలుచురా॥ ప॥ అరమరలేక నిష్పందుఅచలగురుని వెంటతగిలి-గుఱుతువిడిచిపోవుమార్గముగుట్టుతెలియరా॥ప॥ సాధనేమియులేకసద్గురుబోధర్వ్యాపకమైనభావము - భేదరహితమైయున్నదిదిగోవాదులేలవలదురా॥ ప॥ సద్గురుకరుణచే శేషాచలాహ్వయుఁడు- సత్యముగాదెలిపిననిత్యమైనపరముగనరా॥ పట్టుగాను॥

(౧౧౯.)—రాగము - మధ్యమావతి - ఆటతాళము.

పల్లవి.

యోగివినరా సద్గురుబోధగనరా॥

అనుపల్లవి.

యోగివినరాసద్గురుబోధగనరా॥

చరణములు.

యోగాయోగములసందువివరింపనచలము - ప్రకటితంబుగగురుప్రాపుగనుగొనరా॥ యో॥ సకలదేశములందు సర్వవస్తువులందు - యేకరీతిగానున్నదిపరిపూర్ణము॥ యో॥ గగనారవిందముగ గనుపించునెఱుకను-ఎ

గరజిమ్ముముదానియేర్పాటులేకుండ॥ యో॥ యెండమా
వులరీతినుండు బ్రహ్మాండము- దండిభావముచేత చెండుము
యెఱుకను॥ యో॥ పాపలనడుమనుదీపమై వెలిగెడు - ఆ
పరంజ్యోతియే యణగిపోవునుగనరా॥ యో॥ రజ్జుసర్ప
భ్రాంతితోచెడుభంగిని - ముజ్జగంబులుసర్వమూర్తులు
లేవని॥ యో॥ మూలములేనియెఱుకను మూలయనుచు
దలచి-చలనమించుకలేనియచలముగనరా॥ యో॥ సం
శయింపకునీవుసర్వసాక్షివిగావు - నిస్సంగుడవై యెందు
నిండియున్నావు॥ యో॥ ప్రకృతిద్వయమును లేని భావము
తెలియక - భ్రమసియెఱుకనునీవుపరిపూర్ణమనజోకు॥
యో॥ సద్గురుకరుణచే శేషాచలావధూతయుండు-చెప్పినభా
వనుచర్చించిచూడరా॥ యోగి॥

(౧౨౦.)—రాగము నాథనామక్రియ - ఆదితాళము.

పల్లవి.

ఎఱుకనుమీరినది-అదేమోగాని-ఎఱుకచే దెలియునది।

అనుపల్లవి.

ఎఱుకనుమీఱినది - యెందునునిండినది-
మఱుపు తెఱుపులు లేకమర్మమైయున్నది॥ ఎఱు॥

చరణములు.

క్షరమునుగానిదది - క్షరాక్షరద్వంద్వములేనిదది-
చరాచరములుగాకసాక్షిభూతముగాక - పరాపరంబుల
కుపరమైయున్నది॥ ఎ॥ ఆద్యంతములుగానిది - అభ్యం
తరరహితమై - అంతటనిండినది - ఆధారమేమిలేక-అ

చలమైయెందును-వేదాంతభావమై వెలయుచునున్నది ॥ ఎ॥ వాదభేదములులేనిది-సాధులయందుసత్యమైనిండిన ది - నాదానందముగాక - సాధనాంతరములేక - మోదఖేదములులేక - పాదుకయున్నది॥ ఎ॥ ప్రకృతిపురుషుడుగానిది - ఆకృతియులేకవికృతినిబొందినది - నికృతియింతయులేక - ప్రకృతిమీరినయట్టి - సుకృతగురుపుత్రులకుసూచనైయున్నది॥ ఎ॥ వేషభాషలుగానిది-వేదములచేతఘోషింపఁబడకున్నది- దోషదోషములు లేకదూషితమునుగాక - శేషాచలాహ్వయుఁడుతోషమొందినబ్రహ్మ॥ మెఱుకనుమీఱినది॥

(౧౨౧.)—రాగము - ముఖారి - చాపుతాళము.

పల్లవి.

సత్యమైనయచలముగానవలెరా।

అనుపల్లవి.

నిత్యమైననిరంజనమదిరా॥ సత్య॥

చరణములు.

ఆశలన్నియువిడువవలెరా - గురు-సూచనపదములకు సుస్థిరమైయున్నదిరా॥ స॥ రూపాతీతమెగానవలెరా - గురు - రూపమెసాక్షిచేప్రాపించుగదరా॥ స॥ ద్వాదశాకృతిదెలియవలెరా - మేదినిభ్రాంతులుమృషలనవలెరా॥స॥ చలనభావమువిడువవలెరా - శే - షాచలాహ్వయునిస్థిరమిదిగనరా॥ సత్యమైన॥

(౧౨౨.)—రాగము-వసంతం - ఆదితాళము.

పల్లవి.

ఏమియుఁగాకుండునుగా।

అ ను ప ల్ల వి.

ఇది - ఏమనరాకుండుగా॥ ఏమి॥

చ ర ణ ము లు.

కలలోనగనుగొన్నకాయంబుకరణి - కల్లప్రపంచముకల్లస్వరూపము॥ ఏ॥ సన్నపుదిడ్డినిచాలగదూరుట-పున్నమవెన్నెలఁబొందుటయునున్న॥ ఏ॥ ఇరుమూడుచక్రాలనింపుతోడదాటి - ఇలముక్తికాంతనునెనయుటయునున్న॥ ఏ॥ ఆషోడశాత్మరినణచిద్వాదశిఁయగుట - శేషాచలాహ్వాయునిసిద్ధాంతమచలము॥ ఏమియు॥

(౧౨౩.)—రాగము - హిందుస్తాని - అటతాళము.

ప ల్ల వి.

వేదాంతసభలమధ్యమమున - వేయుముజండ।

అ ను ప ల్ల వి.

విశ్వములోనన్నియుగల్ల - వేయుముజండ॥ వేదాంత॥

చ ర ణ ము లు.

ఆరజ్జుసర్పరీతిగానునమరునెఱుక - గొడ్డాలికిబిడ్డవలెనుగూడునెఱుక - గగనపుష్పవతుగదోచుఁగల్లమెఱుక-శశివిషాణరీతిగానసత్యమెఱుక॥ వే॥ గురుసూచనంబుసేయగానె పరగుబ్రహ్మము - ధరకర్తకర్మక్రియలులేకదనరుబ్రహ్మము - మూర్తిత్రయముగాకమెపుడు - పరిపూర్ణబ్రహ్మము - శేషాచలమైన శుద్ధశిష్టబ్రహ్మము॥ వేదాంతసభ॥

# వేదాంతకీర్తనలు.

## (వెంకటరావువారికీర్తన.)

(౧౨౪.)—రాగము - ఎఱుకులకాంభోది - ఆదితాళము.

పల్లవి.

ఆహా ప్రపంచరహితమె-ఆదిమంత్రము॥

అనుపల్లవి.

మనశేషాచలగురుడుచెప్పిన - అచలమంత్రము॥ ఆహా॥

చరణములు,

ఆదితుదలులేనిదయ్యద్వాదశాక్షరిమంత్రము - వృత్తిప్రకృతిద్వయరహితమేపెద్దమంత్రము॥ ఆ॥ సాధకవిద్యలకందదయ్యాస్వామిమంత్రము - ద్వంద్వములనునశింపజేసేదొడ్డమంత్రము॥ ఆ॥ వరయోగులకు నలవికాదువేదాంతమంత్రము-పరమజ్ఞానులుపట్టరానిపరిపూర్ణమంత్రము॥ ఆ॥ కాలాకాలములులేక గనుపించుమంత్రము- మూలములేనియెఱుకనువిడిచే ముఖ్యమంత్రము॥ ఆ॥స్వరూపనామక్రియలులేనిపరిపూర్ణమంత్రము-గురుగోప్యమైయిట్టిదట్టి దనరాకుండువిమలమంత్రము॥ ఆ॥ ఎండమావులపగిదినుండుబ్రహ్మాండమంత్రము - కడుఘీరముతోతెలుసుకొనినషోడశాక్షరిమంత్రము॥ ఆ॥ తనువులునాళ్లునులేనిపరతత్వమంత్రము - కనులుమూసిన తెరచినసదాగనుపించుమంత్రము॥ ఆ॥ పరాపరంబులుగడచినదిపరిపూర్ణమంత్రము-పరమపదమైనయీాబట్టబయలేమంత్రము॥ ఆ॥ ఎఱుకమఱుపులులేనివేదాంతమంత్రము-ధరణిలోవెలసినవేంకటదాసుడుతరించినమంత్రము॥

(౧౨౫. రాగము సురట - చాపుతాళము.

పల్లవి.

మంగళంమంగళం-కేవలాత్మా-మంగళం-మంగళం

అనుపల్లవి.

మంగళం మంగళం - కేవలాత్మా - మంగళం - మంగళం॥

చరణములు.

మనోవాచామగోచరంబును నై మహాదహం కృతిరహితంబునునై - జననమరణసరణిగనుబడకనుజేయుఘనతరావ్యక్తముగడచినయచలము॥ మంగళం॥ మిథ్యాప్రపంచమువంధ్యాసూనునిపగిదితద్ధితకరణములుచిత్తాదులును-అధ్యారోపాపవాదంబులునుగాని - బోధమాత్రముఅధిష్ఠానాతీతము॥ మం॥పంచభూతములనక పంచవర్ణములనక-అంచితజ్ఞానపంచేంద్రియములనక-పంచబ్రహ్మలుపంచాశద్వర్ణములనక- పంచవింశతిమీాఱినచంచలరహితము॥మం॥ సురనరపశుపక్షిక్రిమికీటకాది- చరములుస్థావరసంతతియునుగాక - పరమేష్టివిష్ణుశివాదులునుగాక - పరాపరంబులుగానిక్షరాక్షరాన్యము॥ మం॥ సద్గురుకరుణచే శేషాచలాహ్వయుఁడుశ్రద్ధతోఁదెలిసిన శుద్ధనిర్గుణము- భేదరహితముసాధకాసాధ్యమునాదబిందుకళాతీతపరిపూర్ణము॥మంగళం॥

(౧౨౫.)—తత్వ కీర్తనలు సంపూర్ణము.

